## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

నన్ను "నేను" చేరుకోవటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020010005847

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీ

# క్రొత్త సంగీత విద్యాదర్పణము

ఉపయోగార్థము

శ్రీ ఏ. కాసుబ్బారావుచే



మూడవ కూర్పు

1947

 [ వెల రు. 5—0—0

సీవ విధంబును, మంద్ర మధ్యమస్థాన భేదంబులును, ద్వావింశతి శ్రుతిజాతి
బును, రాగప్రస్తారంబును, ప్రకృతి వికృతి భేదములచే గలిగిన డెబ్బదిరెండు
కర్తలను, ఈ మేళకర్తలవలన బుట్టిన యనేక జన్యరాగంబులును, రాగరూప
నట్టి న్యాసాంశగ్రహాలక్షణంబును, మిశ్రరాగములయొక్క లక్షణంబును,
రాగములకుగల మూర్ఛలును, తాళవ్యుత్పత్తియు, ధ్రువాది సప్తతాళముల
బును, తాళజాతులును, జాతులచే గలిగిన ముప్పదిరైదు తాళంబులును, ద
లక్షణంబును, ఇంకా యనేక విషయములజెప్పి ఇతర గ్రంథాపేక్ష లేకుండునట్లు
ముగా నిందు తెలుపఁబడి యున్నవి. మఱియు. ఈ గ్రంథమునందుండు స్వ
మొదలు తానవర్ణములు, కృతులు మొదలగువాట్లయొక్క స్వరములయందు
రములుగల దీర్ఘాక్షరము తరచుగా కొన్నిచోట్ల రెంటికంటె నధికముగు యక్ష
గలదగుచుండుటచే నట్టి యక్షరకాలము తెలిసికొనుటకు (,) ఈ గురుతు దీర్ఘా
లకుఁ బ్రక్క వ్రాయబడియుండును గాన, (,) ఇవి ఎన్నియుండిన నన్ని యక్ష
కాలమని యెఱుంగునది. మఱియు, లఘుద్రుతము లేర్పరచిన చోట్లయందు
కమునకు మధ్యఘాత వచ్చిన యెడల ఘాతకు యెడమవైపున హ్రస్వముగాను
ఁదవలయుచోట (,) ఈ గురుతు వ్రాయబడియుండును. ఇదెట్లనగా (పా)యన
క్షరమునకు మధ్య ఘాత వచ్చినప్పుడు దానిని స । , ఇటుల నిలువుగీటుకు
వైపున ఒక యక్షరమును, నిలువుగీటుకు కుడివైపున పై నుదహరించిన గు
వ్రాసియుండును గాన, దానిని దీర్ఘాక్షరముగానే పాడుకొనవలయును పిళ్లారిగీ
ఘనరాగగీతములు, స్వరజతులు, పదవర్ణములు అటతాళ తానవర్ణములు, ఆ
తానవర్ణములు, శ్రీ త్యాగయ్యగారి కృతులు, శ్రీ దీక్షితులవారి కృతులు. శ్రీ
శాస్త్రిలవారి కృతులు, శ్రీ పొన్నయ్యపిళ్ళాగారి కృతి, శ్రీ గిర్భపురివారి
శ్రీ కుంతలాంబాంకిత కృతి, శ్రీ శేషశయనాంకిత కృతి, శ్రీ భద్రాచల
దాసుగారి కీర్తన, శ్రీ పట్నం సుబ్రహ్మణ్యంగారి కృతులు, శ్రీ సుబ్బ
శాస్త్రిలవారి కృతులు, శ్రీ పురంధరదాసువారి కీర్తన రామనాథపురము శ్రీ
వాస అయ్యంగారి కృతి, శ్రీ లింగరాజుగారి కృతి, శ్రీ ఓగిరాల వీరరాఘవశ
కృతులు, శ్రీ స్వాతితిరునాల్ వారి కృతి, శ్రీ పల్లవి గోపాలయ్యగారి కృతి
సీతారామారావుగారి రాగమాలిక కీర్తన, శ్రీ నారాయణతీర్థయతీంద్ర విరచి
తరంగము రాగమాలికయును, శ్రీ క్షేత్రజ్ఞులు, శ్రీ ఘనం సీనయ్యగారి పద
శ్రీ జయదేవకవి అష్టపది, శ్రీ ధర్మపురి సుబ్బారావు మొదలగువార్ల జా
భైరవిరాగములో పల్లవియును మొదలగునవి తాళమునకు సరిపడునట్లు లఘుధ
లేర్పరుపఁబడి మంద్ర మధ్య స్థానములకును, కాల పైకాల సంగతులకును, గుణ
మొదలగునవి చేయఁబడి సులభముగా దెలియునటుల వ్రాయఁబడియున్నవి. శ్రీ
మతియొక్క మేళకర్తరాగపద్ధతియును, డెబ్బదిరెండు మేళకర్తరాగములకు చంద్ర

| | |
|---|---|
| 1 ధన్యాసి | శ్యామసుందరాంగ |
| 2 మాయామాళవగౌళ | మేరుసమాన |
| 3 భైరవి | ఉపచారము జేసేవా |
| 4 మధ్యమావతి | వినాయకుని వలె |
| 5 మోహన | ననుపాలింప |
| 6 కాంభోజి | శ్రీరఘువరప్రమేయ |
| 7 కమాస్ | సీతాపతే |
| 8 శంకరాభరణము | మనసు స్వాధీనమైన |
| 9 కేదారం | సమయమిదే |
| 10 బిలహరి | పరిదానమిచ్చితే |
| 11 పంతువరాళి | రఘువర నన్ను |
| 12 కల్యాణి | ఏరాన వరాలిచ్చి |

హెచ్చరిక:- విద్యార్థులు ఈ కృతులనుగాని, వీనితో సమానమైన మరి ఏకీర్తనలనుగాని గాత్రముతో పాడుటగాని లేక జంత్రము మీద వాయించుట గాని చేయవచ్చును.

2. (ప్రాక్టికలు పరీక్షయందు) ప్రత్యేక పరీక్షలకు తోడు సాధారణముగా స్వరజ్ఞానమందును, వినిన రాగములను గుర్తించగలుగుట, చూచి పాడగల్గుట, చెప్పిన క్రొత్తకీర్తనలు వ్రాయగల్గి యుండుటయందునుగూడ పరీక్ష జరుపబడును.

3. ప్రాక్టికల్ పరీక్షయందు విద్యార్థులు తమ ప్రజ్ఞను గాత్రముచే పాడుటవలనగాని లేక ఈ క్రిందివానిలో ఏదైన నొక జంత్రముపై వాయించిగాని కనుబఱచవచ్చును.

వీణ, గోటువాయిద్యము, ఫిడేలు, జాలకోకిల, వేణువు, నాగస్వరము (సన్నాయి). గాత్రపాఠకులు తంబూరశ్రుతి సహాయముతో పాడవలయును.

గాత్రపాఠకులు స్వయముగా తంబురాశ్రుతి మీటుకొనుచు పాడవచ్చును లేదా అభ్యర్థిగాని మరియొకరిని ఈ పనికై నియమించవచ్చును.

పరీక్ష రెండువిధములుగా నుండును.

(1) సిద్ధాంతభాగముపై రెండుగంటలకాలములో వ్రాయవలసిన ప్రశ్నపత్రి ఇయ్యబడును.

(2) జంత్రగాత్రముల పరీక్ష

| | | |
|---|---|---|
| సిద్ధాంతభాగ ప్రశ్నపత్రమునకు | 50 మార్కులు | |
| జంత్రగాత్రపరీక్షకు | 50 | ,, |
| | 100 | మార్కులు |

మార్కుల విభజనము: పరీక్షలో ఉత్తీర్ణుడగుటకు అధమము రావలసిన మార్కులు ఈ క్రింద చూపబడినవి

| అసలు నిర్ణయింపబడినవి | | ఉత్తీర్ణతకు అధమము రావలసినవి | |
|---|---|---|---|
| | | మొదటితరగతి | రెండవతరగతి |
| సిద్ధాంతము | 50 మార్కులు | 30 మార్కులు | 20 మార్కులు |
| జంత్రగాత్రములు | 50 ,, | 30 ,, | 20 ,, |
| | 100 ,, | 60 ,, | 40 ,, |

## చదువదగిన గ్రంథములు

(1) స్వరమంజరి (తెలుగు) టి. సింగరాచార్లు

(2) గాయక పారిజాతం డిటో డిటో

(3) సౌత్ ఇండియన్ మ్యూజిక్ సీరీస్ బుక్ I మొ|| III వరకు ఆంగ్లము పి. సాంబమూర్తి — ది ఇండియన్ మ్యూజిక్ పబ్లిషింగ్ హౌసు, జార్జిటవున్, మద్రాసు

ప్రాక్టికల్ కోర్సు ఇన్ కర్నాటిక్ మ్యూజిక్ (అరవము) బుక్ 1 మొ|| 3 వరకు పి. సాంబమూర్తి — ది ఇండియన్ మ్యూజిక్ పబ్లిషింగ్ హౌస్, జార్జిటౌన్, మద్రాసు.

గోల్డెన్ ట్రెజరీ ఆఫ్ ఇన్డియన్ సాంగ్సు (అరవము) పి. సాంబమూర్తి — డిటో

కీర్తన సాగరం 1 & 2 (అరవము) — డిటో

సంగీత రత్నావళి (అరవము) కె. వి. శ్రీనివాస అయ్యంగారు

త్యాగరాజ కీర్తనములు (తెలుగు - అరవము) — డిటో

సంగీత సుధాంబుధి (తెలుగు) — డిటో



# హైయ్యర్ గ్రేడ్ పరీక్ష

1. ప్రధాన పరిభాషా పదములు, వాటి యర్థము.
2. కె. వి. శ్రీనివాస అయ్యంగారి మ్యూజిక్ బుక్స్‌లోను, పి. సాంబమూర్తిగారి 'సౌత్ ఇండియన్ మ్యూజిక్ సీరిస్'లో ననుసరించిన పరిగమ స్వరలక్షణములు.
3. కర్ణాటక రాగమందలి రాగ విభాగములు 72 మేళకర్త రాగములు. 12 చక్రముల పేర్లు. 'కాటపయాది' సూత్రము. దాని ప్రయోగములు.
4. ఈ క్రింద పేర్కొనబడిన 24 రాగముల లక్షణములు.

| | |
|---|---|
| 1. తోడి | 13. శహాన |
| 2. సావేరి | 14. కాంభోజి |
| 3. చక్రవాకం | 15. యదుకుల కాంభోజి |
| 4. భైరవి | 16. శంకరాభరణము |
| 5. ఆనందభైరవి | 17. హంసధ్వని |
| 6. ఖరహరప్రియ | 18. బేగడ |
| 7. శ్రీరంజని | 19. అఠాణ |
| 8. రీతిగౌళ | 20. నాట |
| 9. ముఖారి | 21. పూర్వకల్యాణి |
| 10. హరికాంభోజి | 22. షణ్ముఖప్రియ |
| 11. నాటకురంజి | 23. కల్యాణి |
| 12. కేదారగౌళ | 24. సారంగ |

5. మనోధర్మ సంగీతము — దాని రూపములు రాగ ఆలాపన పెంపొందింప జేయు పద్ధతి; స్వరకల్పన — దశవిధగమకములు.
6. 35 తాళముల క్రమము. చాపుతాళము దాని వివిధరకములు. దేశాది, మధ్యాది తాళములు. క్రియ, అంగలయ, గతి, మాత్రలు.
7. గీతాది లక్షణములు: వాని స్వరూపములు. ఈ క్రింద పేర్కొనబడిన గీతాది సంగీత రచనల సంపూర్ణజ్ఞానము.

| | |
|---|---|
| 1. గీతము | 5. రాగమాలిక |
| 2. తానవర్ణము | 6. పదము |
| 3. పదవర్ణము | 7. జావళి |
| 4. కృతి | 8. తిల్లాన |

8. సముదాయ సంగీతము, దాని లక్షణములు.

9. కర్ణాటక గాన చరిత్రము, ఈ క్రిందనుదహరించిన వాగ్గేయ కారకుల జీవిత చరిత్రములు — వారు కర్ణాటక గానమునకు చేసిన యుపకృతి.

1. జయదేవుడు
2. పురందరదాసు
3. రామామాత్యుడు
4. సోమనాథుడు
5. నారాయణతీర్థులు
6. భద్రాచలరామదాసు
7. వెంకటమఖి
8. క్షేత్రయ్య
9. పైడాల గురుమూర్తిశాస్త్రి
10. త్యాగరాజు
11. ముత్తుస్వామి దీక్షితార్
12. శ్యామశాస్త్రి
13. అరుణాచల కవిరాయార్
14. గోపాలకృష్ణభారతి
15. స్వాతితిరునాళ్
16. సుబ్బరాయశాస్త్రి
17. వీణకుప్పయ్యర్
18. మైసూరుసదాశివరావు
19. పట్నం సుబ్రహ్మణ్యయ్యర్
20. పల్లవి శేషయ్యర్

10. జంత్ర విభాగములు — తంత్రీ సంబంధకములు, వాయు పూరకములు, ఘర్షణ వాద్యములు. వీణ, వాయులీనము, తంబుర, గోటువాయిద్యము వేణువు వీటి నిర్మాణములను తెలిసికొనుట. ఇదుచెప్పబడిన తంత్రులతో గూడిన జంత్రములను శ్రుతి చేయగల్గియుండుట గాత్రధ్వని యొక్కయు, దక్షిణ హిందూదేశ సమ్మేళన వాయిద్యముల యొక్కయు, హెచ్చుతగ్గు ధ్వనులు.

11. సాధారణధ్వని, గీతధ్వని, ఉన్నతి, తీవ్రమందములు, స్వరభేదములు, స్వభావైక్యమైన కంపనము, ప్రతిధ్వని, సంగీత సంబంధమైన ఆవృతులు, గ్రామభేదములు.

12. గ్రామఫోను, రేడియో, సంగీత కచేరీల జరుపుటకు ప్రవేశముల నుండవలసిన ముఖ్య లక్షణములు.

## జంత్రగాత్రములు (Practical)

1. రెండు క్షేత్రయపదములు, రాగమాలిక ఒకటి, రెండు తిల్లానలు, మూడు జావళీలు ఈ క్రింది కృతులు.

| | |
|---|---|
| 1. తోడి | కద్దనువారికి |
| 2. సావేరి | శంకరిశంకురు |
| 3. చక్రవాకం | ఎటులబ్రోతువో |
| 4. భైరవి | నీపదములె |
| 5. ఆనందభైరవి | నీమది చల్లగ |

| | |
|---|---|
| 6. ఖరహరప్రియ | ప్రక్కలనిలబడి |
| 7. శ్రీరంజని | మారుబల్క |
| 8. రీతిగౌళ | జనని నిన్ను వినా |
| 9. ముఖారి | ఏమనినే |
| 10. హరికాంభోజి | ఎంతరాని తన కెంత |
| 11 నాటకురంజి | మనసు విషయనట |
| 12. కేదారగౌళ | నీలకంఠం |
| 13. శహాన | రామా ఇక |
| 14. కాంభోజి | కొనియాడిన నాపై |
| 15. యదుకుల కాంభోజి | నిను సేవించిన |
| 16. శంకరాభరణము | సరోజదళ |
| 17. హంసధ్వని | వాతాపిగణపతిం |
| 18 బేగడ | నాదోపాసన |
| 19 అఠాణ | ఇలలో ప్రణతార్తిహరుడనుచు |
| 20. నాట | భజనసేయరాదా |
| 21. పూర్వకల్యాణి | నిను వినగ మరి |
| 22. షణ్ముఖప్రియ | మరివేరె దిక్కెవరయ్య |
| 23 కల్యాణి | నిన్నువినా గతిగానజగాన |
| 24. సారంగ | నీవాడ నేగాన |

నోటు:— అభ్యర్థులు ఈ పై కృతులు గాని వీనితో సమాన ప్రాముఖ్యముగల మరి ఏకృతులనుగాని గాత్రముచే పాడిగాని, జంత్రములపై వాయించిగాని తమ ప్రజ్ఞను కనుబరచవచ్చును.

అభ్యర్థులు తాము నేర్చుకొనిన పూర్వ వాగ్గేయకారకుల రచనలలో అధమము ఆఱింటికైనను అర్థము చెప్పగలిగి యుండవలయును.

2. ఈ క్రింద నుదహరించిన 12 రాగములను ఆలాపన జేయగల్గియుండుట;

(1) తోడి (2) నాట (3) భైరవి (4) ఆనందభైరవి (5) మోహన (6) కేదారగౌళ (7) శహాన (8) కాంభోజి (9) యదుకుల కాంభోజి (10) శంకరాభరణము (11) బేగడ (12) కల్యాణి.

3. (1) ఆది, రూపకతాళములలో తోడి, భైరవి, కాంభోజి, శంకరాభరణము, కల్యాణి రాగములందు తాము నేర్చిన గీతములకు స్వరకల్పన సమర్థతగల్గి యుండుట.

(2) నిర్దిష్టములైన 24 రాగములలో ఇచ్చిన కృతిని సరిగమాది స్వరముతో పాడగల్గిగాని, లేదా వాయించగల్గిగాని యుండుట.

(3) పాడిన లేదా వాయించబడిన చరణమునకు స్వరము చెప్పగల్గియుండుట.

(4) ఆలాపించబడిన లేదా వాయించబడిన రాగములను గుర్తించగల్గియుండుట;

(5) తాము ఇదివరలో వినియుండని కీర్తనలకు తాళములను తెలిసికొనగల్గియుండుట.

4. జంత్రగాత్రములలో ప్రత్యేక పరీక్షలకుతోడు సామాన్యముగా వినుటయందును, చూచి పాడగల్గుట చెప్పిన శ్రుతికీర్తనలు వ్రాయగల్గియుండుట యందును ప్రాక్టికలు పరీక్ష జరుగును.

ప్రాక్టికలు పరీక్షయందు అభ్యర్థులు గాత్రముచే పాడుటగాని లేదా ఈక్రింది జంత్రములు వాయించిగాని తమ ప్రజ్ఞను చూపవచ్చును.

వీణ, గోటువాద్యము, వాయలీనము, బాలకోకిల, వేణువు లేక నాగస్వరము గాత్రపాఠకులు తంబురశ్రుతి సహాయమున పాడదగును.

గాత్రపాఠకులు స్వయముగా తంబురా శ్రుతి మీటుచు పాడవచ్చును. లేదా అభ్యర్థి కాని మరియొకరిని ఈ పనికై నియోగించవచ్చును.
పరీక్ష ఈ క్రిందివిధముగా నుండును:—

(1) సిద్ధాంతభాగము, సంగీతచరిత్రపైన మూడుగంటల

| | | | |
|---|---|---|---|
| ప్రశ్నపత్రమునకు | ... | 100 | మార్కులు |
| జంత్రగాత్రముల పరీక్షకు | ... | 100 | ,, |
| | మొత్తము | 200 | ,, |

మార్కుల విభజనము:— పరీక్షలో ఉత్తీర్ణుడగుటకు అధమము రావలసిన మార్కులు ఈ క్రింద చూపబడినవి.

| | | ఉత్తీర్ణుడగుటకు అధమము రావలసినవి. | |
|---|---|---|---|
| | అసలు | మొదటి తరగతి | రెండవ తరగతి |
| సిద్ధాంతము, సంగీతచరిత్ర | 100 మార్కులు | 60 మార్కులు | 40 మార్కులు |
| ప్రాక్టికల్ | 100 ,, | 60 ,, | 40 ,, |
| | 200 | 120 | 80 |

## చదువదగిన గ్రంథములు

సంగీత సంప్రదాయ ప్రదర్శిని - [illegible] } తెలుగు — సుబ్బరామదీక్షితార్ కృతము.
3. చక్రవాకము.
4. భైరవి
5. ఆనందభై

2. సింగరాచారిగారి స్వరమంజరి గాయక పారిజాతం సంగీతకళానిధి గాయకలోచనం — తెలుగు

3. సంగీత రత్నావళి — అరవము - కె. వి. శ్రీనివాసఅయ్యంగార్

4. గానభాస్కరము — తెలుగు - కె. వి. శ్రీనివాసఅయ్యంగార్

5. సౌత్ ఇండియన్ మ్యూజిక్ సిరీస్ I to IV బుక్స్
6 మేళకర్త, జన్యరాగముల పద్ధతి
7. శ్యామశాస్త్రి మొదలగు దాక్షిణాత్య సంగీత ప్రఖ్యాతపురుషులు
8. వేణువు

ఆంగ్లములో - పి. సాంబమూర్తి, ది ఇండియన్ మ్యూజిక్ పబ్లిషింగ్ హౌసు జార్జిటవును : మద్రాసు.

9. ప్రాక్టికల్ కోర్సులో కర్ణాటక సంగీతము Books I to III
10. గోల్డెన్ ట్రెజరీ అఫ్ ఇండియన్ సాంగ్స్
11. కీర్తన సాగరము 1 to 4
12. త్యాగరాజ నౌకాచరిత్రము

తమిళము కర్త డిటో



# శ్రీ వాగ్గేయకారకుల చరిత్రలు

1. శ్రీ జయదేవులు:- వీరు ఉత్తరదేశ, బెంగాలురాష్ట్రములో దిందుబిల్వం అనే గ్రామములో జన్మించిరి. 12 వ శతాబ్దమునాటివారు బ్రాహ్మణోత్తములు సంస్కృతభాషలో అసదృశమైన వాగ్విలాస వైభవము గల కవీంద్రులు. తండ్రి భోజదేవుడు. తల్లి రామాంబ భార్య పద్మావతి. శ్రీకృష్ణభక్తవరులు. కేందులు తరాతరాదులు. దిందుబిల్వపు నివాసస్థుడు ఉత్తరదేశస్థుడైన శ్రీగోవర్ధనాచార్యుని శిష్యులలో నగ్రశ్రేష్ఠులు. తత్వచింతామణి, ప్రసన్నరాఘవనాటకము మొదలైన యనేకగ్రంథములు రచించిన నిపుణులు. ద్వాదశసర్గసహిత మగునట్లు విలసిల్లెడి గీతగోవింద (అష్టపది) శృంగారప్రధానమైన శ్రీరాధాకృష్ణప్రేమతత్త్వమును గాంధర్వముగా విరచించిన యద్వితీయులు. ఈ జయదేవకవి పందొమ్మిదవ యష్టపది వ్రాయబోని యున్నప్పుడు "స్మరగరళఖండనం. మమశిరసి మండనం, దేహిపదపల్లవ ముదారం" అని తలంపుకు వచ్చి వ్రాయక తాటాకును తనభార్య పద్మావతి చేతికిచ్చి యభ్యంగస్నానార్థమై నది కేగుచుండెను. వెంటనే శ్రీకృష్ణ భగవానులు తలంటుకొన్న జయదేవ రూపముతో వచ్చి పద్మావతిని పిలిచి తాటాకును, కలమును పుచ్చుకొని జయదేవునకు తోచినట్లుగా సాహిత్యమును రచించి పూర్తి చేసి అంతర్థానమైరి. స్నానానంతరము జయదేవులు భార్యను తాటాకును కలమును దెమ్మని యడిగెను. ఆశ్చర్యముతో "ఇప్పుడే తామువచ్చి వ్రాసియిచ్చితిరి" అని చెప్పి తాటాకు నిచ్చెను. పూర్తిగా రచించినదానిని జూచి యానందముతో "ఓ పద్మావతీ! నీ వేమి సుకృతము చేసితివో కదా? భగవంతుడు నీకు దర్శనమిచ్చెను" అని పొగడుచు నా యష్టపది యెనిమిదవ యడుగున 'జయతు పద్మావతీరమణ జయదేవకవి భారతీ భణిత మతిశీతం' అని 21 వ అష్టపదిలోను తన నామమునకు ముందును నామె పేరుం బెట్టెనట. (వీరు శార్ఙ్గదేవుల కాలమునాటి వారుగాఁ దెలియుచున్నది) ఈ యష్టపదులు కీర్తనకు 8 పాదములు చొప్పున 24 కీర్తనలు, నాయకా, నాయకీ, సఖులచే పాడబడుచుండును. సంగీతకీర్తనలకు అష్టపదులే ప్రప్రథమములుగా నున్నవని యని తెలియుచున్నది. ఈ అష్టపదుల ననుసరించి "రామాష్టపది" రామకవియును, "శివాష్టపది" చంద్రశేఖరేంద్ర సరస్వతి కవియు రచించిరి.

2. శ్రీ పురందర విఠలదాసు (కర్ణాటక సంగీత పితామహ):- వీరు 16-వ శతాబ్దములోనివారు. కర్ణాటక బ్రాహ్మణోత్తములు. భార్య సరస్వతిబాయమ్మ. మధ్వమతస్థులు. తండ్రి వరదప్ప. ధనికులు. కన్నడభాషలో మహాగొప్పపండితులు. భక్తాగ్రేసరులు. వీరు మొదట పూనాపట్టణమున సాహుకారై కోటీశ్వరుడుగానుండి శ్రీ పాండురంగవిఠలునిమీద భక్త్యాతిశయమువల్ల తన ఆస్తినంతయు దానధర్మములు

చేసిరి. సంగీత సాహిత్యములలో మిక్కిలి ప్రజ్ఞగలవారై యుండి కొక్క వినయమునందు వీరు రచించిన కీర్తనములచే శ్రీ పాండురంగ విఠలుని ప్రసన్నతను బొందినవారై యుండిరి. వేదాంత తత్త్వములను జనులకు బోధించిరి. వీరి యుద్భృత చరిత్రము వివరింప వ్రాయనలవిగాదు. సంగీతములో యిప్పటికిని వాడుకలో గల మాయామాళవగౌళ రాగములో ప్రారంభకులకు స్వరాలను బోధించుట వీరే ప్రారంభించిరి. సంగీతము నేర్చుకొనుటకు వీలుగా స్వరావళి, అలంకారములు, గీతములు, ఠాయములు, సూళాదులు, ప్రబంధములు రచించిరి. వీరి కీర్తనలన్నియు వేదాంత విషయముగా నున్నవి. యిన్ని యున్నవని చెప్పుటకు సాధ్యముగాకున్నవి. మరియు వీరికి కర్ణాటక సంగీత పితామహ, యని బిరుదు కలదు.

3. శ్రీ రామామాత్యుడు (అభినవ భరతాచార్య):— వీరు 16 వ శతాబ్దము నాటివారు. తెలుగు నియోగి బ్రాహ్మణోత్తములు. తిమ్మామాత్యుల కుమారుడు 1550 సం॥ రంలో విజయనగరము నేలిన శ్రీ రామదేవరాజు కొరకై స్వరమేళ కళానిధి యను నొక గ్రంథము వ్రాసియుండిరి. ఇందు స్వర, వీణ, మేళ రాగములు చెప్పంబడి యుండినవి. జనక జన్యరాగ పద్ధతి గూడ వ్రాసియుండిరి 20 మేళములు కొన్ని జన్యరాగములు రచించి ఉత్తమ, మధ్యమ, అధమ రాగ విభాగములను చేసి యుండిరి. ఈ భాగ రాగము వీరికి శుద్ధ ప్రమాణము. శార్ఙ్గదేవుని 12 వికృతి స్వరముల పద్ధతికి వ్యతిరేకముగా వీరు 7 మాత్రమే పేర్కొనిరి. వీరు మైన నాల్గు తీగల వీణ వీరి కాలము నాటిదేను. వీరు అభినవ భరతాచార్య యను బిరుదమును పొందియుండిరి. వీరు సంగీతములోను భాషావిషయములోను అనేక గ్రంథములు రచించిరి.

4. శ్రీ సోమనాథ పండితుడు:— వీరు 15-16 శతాబ్దముల నాటి వారని తెలియుచున్నది. నివాసస్థలము గోదావరి మండలమునందలి నివాసులు. వీరు ఆంధ్రులు. వైదిలింగ్య నివాసులు. ముద్గలసూరి పుత్రులు. సంగీత సంస్కృతములయందు మహాప్రజ్ఞగలవారు. శ్రీ రామామాత్యుని రచన ననుసరించి గీర్వాణభాషయందు 1609 సం॥ రమున రాగవిబోధము, యను లక్షణ గ్రంథమును రచించిరి. ఇందు శ్రీవారి యొక్క కాలము నాటి 23 మేళకర్తలకు వీటినుండి పుట్టిన జన్యరాగములను వ్రాసియుండిరి. 15 వికృతి స్వరముల ఆధారమును బట్టి 60 మేళములను పేర్కొనిరి. వీరు సోమనాథీయ మను మీమాంస గ్రంథమును గూడ రచించియుండిరి.

5 శ్రీ తీర్థనారాయణస్వామి:— వీరు 16 వ శతాబ్దములోని వారు. ఆంధ్ర రాష్ట్రములోని కృష్ణాజిల్లా వాస్తవ్యులు. ఆంధ్ర బ్రాహ్మణోత్తములు. శ్రీకృష్ణ లీలా తరంగిణిని 12 సర్గలలో వ్రాసియుండిన పండితోత్తములు. వీరి తరంగములు పల్లవి, అనుపల్లవి, చరణములు కలిగియున్నవి. వీరికి కడుపు నొప్పి వ్యాధి యుండియున్నను

వీరు సంచారార్థము తంజావూరుజిల్లా నాదుక్కావేరి అను గ్రామమునకు వెళ్లియుండి ఆ రోజు నిద్రించగా వైకుంఠేశ్వరుడు కనుపించి రేపు ప్రాతఃకాలమందు నీ యనుష్ఠానమైన తదుపరి కనబడు వరాహము వెంటబోయి అదిఅంతర్ధానమగుచోట నీ కృష్ణలీలా తరంగిణిని గానము చేసిన పిమ్మట నీ కడుపు నొప్పి వ్యాధి తగ్గునని చెప్పి అంతర్ధానమైరి. అదే రీతిగ యా వరాహము వెంట వెళ్లగా అది భూపతి రాజ పట్టణములో వెంకటరమణస్వామి దేవళంబున అదృశ్యమయ్యెను. వెంటనే తన తరంగిణిని గానము చేసి శిష్యులకు నేర్పిరి. ఆగ్రామమునకు వరాహపురి యని పేరు వచ్చెను. వీరి సమాధి ఆ దేవళము దగ్గరగానే యుండియున్నది. శ్రీకృష్ణ జయంతి రోజున భక్తులందరును శ్రీవారి యొక్క తరంగములు పాడుచు భజనలు చేయుచుందురు. వీరి యొక్క ప్రతిమ అచ్చటనే యిప్పటికిని యుండియున్నది.

6. (శ్రీ) భద్రాచల రామదాసు:—వీరు 16వ శతాబ్దములోనివారు వీరు తెనుగు నియోగి బ్రాహ్మణోత్తములు. కంచర్ల కులోద్భవుడు. నివాసము నేలకొండపల్లి. లింగనమంత్రి కుమారులు. తల్లి కామాంబ. సంగీత సాహిత్యమందు గొప్ప ప్రవీణులు. భద్రాచల ప్రభావంబును విని శ్రీరాముల సేవించి, భజన పరులై కొన్నాళ్ళు గడచిన పిమ్మట నొక దినంబున భక్తుడగు కబీరుదాసుగారు తన యింటికి వచ్చి, వీరి భక్తికి సంతసించి, శ్రీరామ తారకమంత్ర మూపదేశించి వెడలిపోయెను. తరువాత రామదాసు (గోపన్న) యీ తారకమంత్రమును జపించుచు నొకనాడు, శ్రీరామచంద్రులు ప్రత్యక్షమై "నీవు భద్రాచలము తాలూకా తహశ్శీలుదారువౌదువని" చెప్పి యంతర్ధానమైరి. తరువాత కొన్నాళ్ళకు భద్రాచల తహశ్శీలుదారుగా నుండి ఆ రోజులలో నైజాం సర్కారువారి ద్రవ్యమును శ్రీరామ కైంకర్యార్థము ఖర్చుపెట్టుటచే 12 సంవత్సరములు బందిఖానా విధింపబడియుండిరి. బందిఖానాయందు చాలా కష్టపడుచు వీరు భక్తితో రచించి వ్రాసినకీర్తనలు హృదయరంజకములుగా యుండియున్నవి. వీరి కీర్తనలను అనేకము లిప్పుడు భజనకాలమందు భక్తులు పాడుచుందురు. వివరములు వీరు రచించిన చరిత్రయందు గానబడును.

7. (శ్రీ) వెంకటమఖి:—వీరికి వెంకటేశ్వర దీక్షితులను పేరు గలదు వీరు 17వ శతాబ్దములోనివారు. తండ్రి గోవింద దీక్షితారు. 2వ కుమారుడు అయి యున్నారు. అన్న యగు యజ్ఞ నారాయణ దీక్షితారు యొద్ద ఆరంభమున సంగీతము నభ్యసించి, అటు పిమ్మట ఉత్తర దేశపు పాటకుడగు శ్రీ తానప్పాచార్యుని యొద్ద సంగీత విద్య అభివృద్ధి చేసిరి. ఈ గురువును మనస్సున ధ్యానించి ఆరభి రాగమున "గంధర్వ జనతా ఖర్వీదుర్వారగర్వభంజనురా" అనుగీతమునురచించిరి. క్రీస్తుశకము 1660 సం॥లో చతుర్దండి ప్రకాశిక యను గ్రంథమును చోళమండలము నేలియుండిన విజయరాఘవ భూపాలుని కోర్కెపై రచించిరి. ఇందు వీణ, శ్రుతి, స్వర, మేళ,

రాగ, ఆలాప, తాన, గీత, ప్రబంధ కాలములను చర్చించి యుండిరి. రాగాంగ, ఉపాంగ, భాషాంగ, రాగముల లక్షణములను బట్టి శ్లోకములను వ్రాసి తన గీతములు నుదహరించిరి. జయదేవు రచన ననుసరించి త్యాగరాజస్వామిని స్తుతించుచు 24 అష్టపదులను వ్రాసి తరించి యుండిరి. వీరిని గురించి కథ లెన్నియో గలిగియున్నవి.

8. శ్రీ క్షేత్రజ్ఞులు:— వీరు 17-వ శతాబ్దమునాటివారు. ఆంధ్రబ్రాహ్మణోత్తములు. చిత్తూరుజిల్లా చంద్రగిరి తాలూకా, మువ్వపురి గ్రామకాపురస్థులు. మధుర, తంజావూరు, గోల్కొండ, విజయనగర సంస్థానములందు బహు సత్కారమందిన సుమహాఘనులు. తెలుగు పదములను వ్రాసి తరించి గోపాలుని దర్శన మందిన మహాపుణ్యాత్ముడు. షుమారు 4 వేల పదములు వ్రాసి మువ్వగోపాల యను ముద్రతో రచించిరని తెలియుచున్నది. అప్పటి రాజుల కోర్కెపై తన పదములను వినిపించుచుండిరి. పదములు రచనలలో అద్వితీయులు. శ్రీ విజయ రాఘవనాయకుని కోర్కెపై శ్రీ విజయరాఘవ పంచరత్నములు రచించి శ్రీవారికి అంకితము నిచ్చెను. జయదేవుడే నారాయణ తీర్థులుగను, వీరు అపరనారాయణ తీర్థులుగా నా కాలమున యనుకొనుచుండిరి.

9 శ్రీ పైడాల గురుమూర్తి శాస్త్రి (వేయిగీత):— వీరు తెనుగు మరికినాటి బ్రాహ్మణోత్తములు. తిరునల్వేలిజిల్లా, కయత్తారు గ్రామకాపురస్థులు. వీరు 18 వ శతాబ్దములోని వారని తెలియుచున్నది. చతుశ్శాస్త్ర పండితోత్తములు. సంగీతములో మహాసమర్థులు. అనేక గీత, ప్రబంధ, కీర్తనలను రచించి తరించిన మహాఘనులు. వీరు 1000 గీతములను రచించుటచే వేయిగీత, అనిగూడా బిరుదు గలదు. మద్రాసులో చిన్నతనమునందే మణలి చిన్నయా మొదలియారుచే బహు సన్మాన మొందిన ఘనుడు. వీరు అనేక గీతములనే గాక ప్రబంధములను కృతులను రచించి తమ స్వనామమునకే అంకిత మిచ్చి యుండిరి

10. శ్రీ ముద్దుస్వామి దీక్షితులు:— వీరు 1775.1835 సం॥ ప్రాంతములవారు. సంగీత త్రిమూర్తులలో రెండవవారు. తంజావూరు జిల్లాలోని తిరువారూరు అనే గ్రామమందు జన్మించిరి. హంసధ్వని రాగమును సృష్టించిన రామస్వామి దీక్షితులు వీరితండ్రి, తల్లి సుబ్బమ్మగారు. వీరు వెంకటమఖి సంతతివారు. వీరికి పదియారు వత్సరములలోగానే క్రమాంతము, కావ్యనాటకాలంకారము, వేదాధ్యయనము, వ్యాకరణము, మరికొన్ని వ్యాఖ్యానములు, సంగీతమును నేర్చుకొని మాంత్రిక, జ్యోతిష, వైద్యశాస్త్రములలో నతిసమర్థుడై ప్రఖ్యాతిగాంచిరి. వీరి వివాహమైన పిమ్మట మణలి, యను గ్రామములో చిన్నయా మొదలారి గారి వద్ద నున్నప్పుడు, వీరి యదృష్టవశమున చిదంబరనాథయోగి యనునొక మహాసిద్ధుడు వీరున్న గ్రామమునకు వచ్చినప్పుడు, వీరి భక్తికి సంతోషించి, శ్రీవిద్యామహామంత్రో

ముపదేశించి తనవెంటనే కాశీక్షేత్రమునకు తీసికొనివెళ్ళెను. వీరు గంగా తీరమున అయిదు సంవత్సరములుండి, కర్ణాటక, హిందూస్థాని సంగీతములందు పాండిత్యము సంపాదించిరి. ఆటుపిమ్మట కొన్నాళ్ళకు వీరు చిదంబరనాథయోగి, యనుమతిబొంది తిరిగి వచ్చుచు తిరుత్తణి చేరగా అచ్చటను బ్రహ్మణ్యేశ్వరు ప్రత్యక్షమై కోటికి పంచదార గడ్డ నిచ్చి అదృశ్యమాయెను. అప్పటినుండిగురుగుహాముద్రతో,నవగ్రహకృతులు నవావర్ణకృతులు పంచలింగస్థల కృతులను వ్రాసిరి వీరు అపూర్వరాగములలో, తాన వర్ణములు, రాగమాలికలు లక్షణ గీతములు వ్రాసిరి. తమ్ములు చినస్వామిబాలస్వామి దీక్షితులు. మధురకు వెళ్ళి అన్నగారు రచించిన కృతులు గానము చేసి మెప్పువడసిరి. పిమ్మట చినస్వామి మరణించగా, బాలస్వామి దుఃఖాక్రాంతుడై సేతుయాత్రకువెళ్ళి తిరిగి ఎట్టయపురము చేరి ఆరాజుచే ఆదరింపబడి వివాహమాడెను. ఈవృత్తాంతముముద్దుస్వామి విని, తమ్మునికొరకు పోయి పెండ్లికుమారుడైయున్న సోదరు చూచి సంతసించి వివాహమైన పిదప తిరిగి తిరువారూరు వెళ్ళిరి. 1835 సం॥లో రాజపుత్రుని వివాహమునకు, ఎట్టయపురము వెళ్ళి కొంత కాలమునకు 1835 సం॥రం అనగా మన్మథ నామ సంవత్సర తులాకృష్ణ చతుర్దశినాడు శ్రీపుర చేరిరి వీరికృతులన్నియు ఎక్కువ సంస్కృతములో షుమారు 300 వ్రాసియుండిరి. అవి నాకేళ పాకముగాయుండును. వీరి శిష్యులు తిరుక్కడయూరు భారతి, తేవూరుసుబ్రహ్మణ్యయ్య, వడివేలు తిరువారూరు అయ్యాస్వామి మొదలగువారు.

11. శ్రీ త్యాగరాజయ్య:—వీరు 1759-1847 సం॥ ఆ ప్రాంతములవారు. సంగీత త్రిమూర్తులలో శ్రేష్ఠుడున్నూ, కవిశేఖరుడున్నూ, గాయక సార్వభౌముడగు శ్రీ త్యాగరాజయ్యగారు తంజావూరు జిల్లాలోని తిరువారూరు, అనే గ్రామమున జన్మించిరి. వీరి పూర్వీకులు ఆంధ్రదేశమునుండి దక్షిణ దేశమునకు వచ్చి నివాస మేర్పాటు చేసుకొనిరి. వీరు ములకినాడు త్రిలింగ వైదీక తెలుగు బ్రాహ్మణోత్తములు. తనతల్లి మాతామహుడగు గిరిరాజకవి. వీరి తాత గారిపేరు సుబ్రహ్మణ్యస్వామి. తండ్రిగారిపేరు రామబ్రహ్మస్వామి గారు. తల్లిగారిపేరు శాంతమ్మ. ఇంటిపేరు కాకర్లవారు. భారద్వాజస గోత్రికులు. 35వ యేట ప్రథమభార్య మరణించెను. సంతతి లేదు రెండవ భార్యపేరు పార్వతి. మహా యిల్లాలు. పతి భక్తురాలు. పతి జీవించియుండగనే యీమెగూడ శివపురి కేగెను. ఈమెకు ఒక్క కుమార్తెయే. సీతామహాలక్ష్మి యని పేరున గలదు ఆమెను సుబ్బరామయ్య యను సుజనునకిచ్చి పెండ్లిచేసెను శొంఠి వెంకటరమణయ్య యనే గురువు గారివద్ద సంగీతము నేర్చుకొనిరి శ్రీ త్యాగయ్యగారు సంస్కృతాంధ్ర, వేదశాస్త్ర, జ్యోతిష, సంగీత శాస్త్రములలో మిక్కిలి ప్రవీణత వహించిన ఆంధ్రులు. వీరు మహాభక్తులగుటయేగాక శ్రీరామోపాసకులై, తొంబది ఆరుకోట్ల శ్రీరామనామము జపించగా శ్రీరామచంద్రుల ప్రత్యక్షమందిన మహనీయులు. వీరితండ్రి గతించిన పిమ్మటకొద్ది యాస్తితోనే జీవితము గడు

పుచుండిరి. శ్రీరామచంద్రుని యనుగ్రహము వలన గలిగిన జ్ఞానసంపత్తుచే శ్రీరాముని పై కీర్తనలు వ్రాయుచుండిరి. వీరు వీణ వాయించువారు. అతిమధుర గాత్రము. ద్రాక్షా పాకమువంటి కవిత్వము. ఒకసమయమున నారదమహర్షి యొక సన్యాసిరూపమున వీరి వద్దకు వచ్చి, స్వరార్ణవమను సంగీత గ్రంథమును యిచ్చి అంతర్ధానమైరి. శ్రీ త్యాగయ్యగారు 2400 కృతులు రచించిరి. ఇవిగాక దివ్యనామ సంకీర్తనలు, ఉత్సవ సంప్రదాయ కీర్తనలున్నూ, మరియు వీరు పుణ్యక్షేత్రములను సేవించినప్పుడు, ఆయా దేవతలను గూర్చి కొన్ని కీర్తనలు గూడ రచించిరి. ప్రహ్లాద భక్తి విజయము, రాగ రత్నమాలిక, నౌకాచరిత్రము అను గ్రంథములు గూడ రచించిరి. త్యాగయ్యగారు తమ మరణకాలము గుర్తెరిగినవారై ముందుగా సన్యసించి, ది 6.1.1847 సం॥రం, అనగా పరాభవ నామసంవత్సర పుష్య బహుళ పంచమినాడు తమ 80 వ, సంవత్సరమున శ్రీపదమేగిరి. వీరి సంవత్సరీక మహోత్సవము అతివైభవముతో గాయకులందరు తలరాష్ట్రములందు గూడ సల్పెదరు. వాల్మీకి మహర్షి, మధుర రామాయణమును సంగీతమున గానము చేయుటకు శ్రీ త్యాగయ్యగారి రూపమున యవతరించెననియు, వాల్మీకి మహాఋషి 24000 శ్లోకములలో రామాయణమును రచించినటుల శ్రీ త్యాగయ్యగారు 24,000 కీర్తనలలో రామాయణము రచించియుండిరని తెలియుచున్నది. సీతామహాలక్ష్మియను కుమార్తెకు ఒక పుత్రుడు మాత్రము జన్మించెను. ఆ పిల్లవానికి త్యాగరాజయని పేరు పెట్టిరి. ఆ సంస్కారములు పెరిగి బాల్యములో మృతుడాయెను. వీరి సంతతివారు యిప్పుడు ఎవరు లేరని తెలియుచున్నది. శ్రీవారి అంతేవాసులు(శిష్యులు) వీణకుప్పయ్యర్, సుందరభాగవతార్, సభాపతిఅయ్యర్, సుబ్బయ్యర్ మొదలగు వారు.

12. శ్రీ శ్యామశాస్త్రిలు:—వీరు1763—1827 సం॥ ఆ ప్రాంతములవారు. సంగీత త్రిమూర్తులలో మూడవవారు. వీరు తంజావూరుజిల్లాలో తిరువారూరు అనే గ్రామములో 763 సం॥రం చిత్రభాను నామసంవత్సర మేషరవి కృత్తికా నక్షత్రమున జన్మించిరి గౌతమ గోత్రికులు, బోధాయన సూత్రము. తండ్రి విశ్వనాథ అయ్యర్. ఈ శ్యామశాస్త్రిగారు జన్మించుటకుముందు తల్లిదండ్రులు తిరువారూరి యందున్న శ్రీ కంచి కామాక్షీదేవి పూజోపచారకులు. వీరికి సంతతి లేకపోవుటచే శ్రీ కామాక్షీదేవిని సత్యభక్తితో పూజించుచు ప్రతినెలయొక్క కడపటి శనివారమందు శ్రీ వేంకటాచలపతి ప్రీతిగా బ్రాహ్మణ సంతర్పణ నొనర్చుచుండిరి. ఇట్లు ఒక వింత స్వప్నము జరుగుచుండ శ్రీ వేంకటాచలపతి ఒక ముసలి బ్రాహ్మణునకు ఆకళించి శ్యామశాస్త్రిలవారి తల్లిదండ్రులకొక సంవత్సరములోగా నొక పుత్రుడు కలుగునని దీవించి నడిచెను. ఆ ప్రకారమే వీరితల్లి గర్భవతియై నవమాసములు పూర్ణమైన పిమ్మట 10 వ మాసములో నిర్ణీతకాలమందు శ్యామశాస్త్రిలవారు జనించిరి. వీరికి మొదట వెంకట సుబ్రహ్మణ్యమని పేరు పెట్టిరి. గాని ముద్దునకు శ్యామ

కృష్ణ యని పిలుచుచుండిరి. వీరు బాల్యమునందే సంస్కృతాంధ్రభాషల యందలి ప్రజ్ఞగలవారై మేనమామ నొద్ద కొలదిగ సంగీతవిద్య నభ్యసించి 18వ యేట తలితండ్రులతోగూడ తంజావూరు వచ్చిరి. ఒకనాడు కాశీనుండి యాత్రార్థియై వచ్చిన ఆంధ్ర బ్రాహ్మణోత్తముడగు సంగీతస్వామి శ్యామశాస్త్రులుగారి యింటికివచ్చి భిక్షకై పిలువబడి వచ్చినప్పుడు శ్యామశాస్త్రులు గారియొక్క భవిష్యత్తును చెప్పుటయేగాక, అపూర్వరాగ తాళ ప్రస్తారక్రమములను దెలిపి గంధర్వ గ్రంథముల నిచ్చి తాను వెడలిపోవునప్పుడు శ్యామశాస్త్రిగారిని పిలచి ఓ శ్యామా! సంగీతశాస్త్రమందు గొప్ప పండితుడవైతివి. ఇంకను సంస్థాన గాయకుడగు పచ్చిమిరియం ఆదిఅప్పయ్యాగారి సంగీతమును తరుచుగా వినుచుండుము. అని చెప్పి కాశికి వెళ్లెను. పిమ్మట శ్యామశాస్త్రులుగారు యటులనే చేసి ఆదిఅప్పయ్యగారి ప్రేమపొంది శ్రీకామాక్షియొక్క అనుగ్రహము నొందిన శ్యామశాస్త్రులు మహాపురుషు డగుటచే శ్యామకృష్ణ ముద్రతో అనేక కృతులు, తానవర్ణములు, స్వరజతులు, నవరత్న మాలికలు రచించి మహా గాయకుడని పేరు పొందిరి. వీరు మాంజి, కలగడ, చింతామణి, మొదలగు అపూర్వ రాగములను గూడ కల్పించిరి. వీరు మానవస్తుతికి సంతోషించువారు కారు. త్యాగరాజయ్యగారికి వీరు మిత్రులగుటచే వీరిరువురను తమ తమ రచనలను విమర్శించి సరి చూచుకొనెడివారు. వీరు షుమారు 300 కృతులు రచించిరి. అవి వారి ప్రియగల దేవిపై నుతియించునవియై యున్నవి. అవి కదళీపాకముగా నుండును. ఎక్కువ ప్రచారములో లేవని తెలియుచున్నది. ముందు వీరి భార్య శ్రీపురి చేరెను. భార్య గతించిన వెంటనే అయిదు రోజులే నాకు ఆయువు గలదని శ్యామశాస్త్రులుగారు అందరితో జెప్పి ఆ నిర్ణీతకాలమందు అరవదినమున 1827 సం॥రం వ్యయ సంవత్సర మకర మాస శుక్లదశమి రోజున తమ 64వ సంవత్సరమున శ్రీపురి చేరిరి. వీరికి పంజుశాస్త్రి సుబ్బరాయశాస్త్రి అను ఇద్దరు కుమారులు గలరు— శ్రీ వారి అంతేవాసులు, (కుమార్డు) సుబ్బరాయశాస్త్రి, ఆలనూరు కృష్ణయ్య దాసరి మొదలగువారు.

13. శ్రీ అరుణాచల కవిరాయలు:— వీరు 1711—1778 సం॥ ప్రాంతములవారు. తంజావూరు జిల్లా తిల్లైయాది గ్రామకాపురస్థులు. సంగీత విద్యా సమర్థులు. తండ్రి నల్లతంబిపిళ్లై. తల్లి వల్లియమ్మ, అరవభాషలో పంచలక్షణములు, తెలిసిన మహావిచక్షణులు. కంబరామాయణమును అర్థప్రసంగము చేయుటయందు వీరు మహాప్రవీణులు. అరవభాషలో కీర్తనములు రచించినవారిలో వీరు పదునెనిమిదవ వారు. వీరు చిన్న వయస్సులోనే, మిక్కిలి విద్య నభ్యసించి వివాహముచేసికొన్న తరువాత గూడా ధర్మపరమందు విద్యనభ్యసించిరి, వీరు బంగారము, వెండివర్తకము చేయువారగుటచే. వ్యాపారరీత్యా నొకప్పుడు ధర్మపరములో సంగీతముపాడుటచే నచ్చటి మఠాధిపతి వీరికి శేఖాజీ యను పేరు పెట్టెను. వీరు శ్రీమద్రామాయణకథాసందర్భము లనుసరించి ఆయా రసములకు దగిన రాగములతో అరవ కాండములకు అరవకీర్త

నములు రచించి మణలి ముద్దుకృష్ణ మొదలివారి సభలో శ్రీ రామస్వామిదీక్షితులు మొదలైన విద్వాంసులయెదుట వినిపించి కనకాభిషేకము జెంది కీర్తిబొందిరి. తరువాత కొంతకాలమునకు వీరు శ్రీరంగము వెళ్ళి అచ్చటి దేవాలయ పూజారి కోరిక ననుసరించి 'ఏన్ పళ్ళికొండీరయ్యా' అను కీర్తనమును యింకరామాయణ కీర్తనములు అనేకము పాడి వారిచే బహుమానములను బడసిరి. వీరికి ఇరువదిమంది శిష్యులు గలరు.

14, శ్రీ గోపాలకృష్ణభారతి :— వీరు 1811-1881 సం॥ల ప్రాంతములవారు. శైవ బ్రాహ్మణుడు. తంజావూరుజిల్లా, నారిమణం గ్రామకాపురస్థులు. తండ్రి రామస్వామి భారతి శివభక్తుడు, గొప్పవైణికుడు. గోపాలకృష్ణ భారతి వేదములు పఠించి యోగవిద్యనభ్యసించిరి. సంగీత విద్యయందుకూడ పండితులు. వీరు రక్తిరాగ, దేశీయరాగములయందే గాక, కొన్ని యపూర్వ రాగములయందుగూడ గేయకల్పనాచమత్కారములు తెలియునట్లనేక కీర్తనములు గోపాలకృష్ణ ముద్రతో జెప్పియున్నారు. సంగీత కాలక్షేపములచే దొరకిన ధనమును, దాన ధర్మములకు వినియోగించుచుండెడివారు. నందనార్ చరిత్రమును నాటకముగా వ్రాసి ప్రదర్శింపించిరి. కందప్పచెట్టియారు యను ధనవంతుడు, యీ నాటకమును చూచి బహుమతి యిచ్చెను. శీస్ యను ఫ్రెంచి యుద్యోగి యీ నాటకము ముద్రింపించెను. ప్రస్తుతము ఒక్క ప్రతికూడా లేదని తెలియుచున్నది. జ్ఞానచింధు, జ్ఞానకుమ్మి యను గ్రంథములను, అయర్ పాగైనయనారు చరిత్రము, తిరునీలకాంతనయనారు చరిత్రము కరైకాల్ అమ్మయారుచరిత్రములను సంగీతనాటకములను వ్రాసిరి. మరియునందిబిందు మొదలైన సంగీత లక్షణములను పునరుద్ధరించిరి. వీరు బ్రహ్మచర్య వ్రతములో డెబ్బదియేండ్లవరకు జీవించి, 1881 - వ సంవత్సరము మహాశివరాత్రినాడు శ్రీపురి జేరిరి. వీరి కీర్తనములు దక్షిణాది సంగీత విద్వాంసులు ముఖ్యముగా పాడుచుండుట నేటికిని వినవచ్చును. అరవములో కీర్తనలు చేసినవారు :- 1. సుందరమూర్తి స్వామి (తేవారములను చేసియున్నారు.) 2. తిరుజ్ఞాన సంబంధస్వామి 3. మాణిక్యవాచిక స్వామి, మొదలగువారు.

15, శ్రీస్వాతితిరునాల్ (కుల శేఖరమహారాజా):— వీరు 1829-1847 సంవత్సరములలో తిరువాన్కూరు మహారాజాగారు, 16-4-1813 సంవత్సరములో

జనన మొందిరి. సంస్కృతము, మలయాళము, అరవము, మరాఠీ, హిందూస్థానీ, తెనుగు, మణిప్రవాళ విద్యలయందు పండితులు. అనేక పదములు, రాగమాలికలు, కీర్తనలు, వర్ణములు, తిల్లానాలు, వీటికి స్వరములు కల్పనచేసి, పద్మనాభ యను ముద్రతో మూడువందలకు పైగా రచించి యుండిరని తెలియుచున్నది. విద్వాంసులను ఆదరించేవారు శ్రీ పరమేశ్వర భాగవతార్, శ్రీ గోవిందమారర్, శ్రీ వడివేల్ గార్లు వీరి యాస్థానమునందు పండితులుగా యుండెడివారు. శ్రీ స్వాతితిరునాల్ (కులశేఖరమహారాజు) గారు దక్షిణహిందూదేశపు సంస్థానములకు చెందిన రాజకవులలో ఉన్నతపీఠ మలంకరించియుండిరి.

16. శ్రీ సుబ్బరాయశాస్త్రి:—వీరు 1803 సం॥ రములో అనగా దుందుభి నామ సం॥ర సింహమాస కృత్తిక నక్షత్రమున జన్మించిరి. శ్రీ శ్యామశాస్త్రిగారియొక్క రెండవ కుమారులు. సంస్కృతము, తెనుగు, అరవము సంగీతములయందు గొప్ప పాండిత్యము సంపాదించి యుండిరి. వీరికి మొదటి గురువు తండ్రి గారు. తరువాత శ్రీ త్యాగరాజయ్యగారు. కుమార అను ముద్రతో స్వరజతులు, స్వరసాహిత్యము, చిట్టస్వరములతో కృతులను రచించి యుండిరి. వీరియొక్క రచనలను శ్రీ త్యాగరాజయ్యగారు కొనియాడెడివారు. ఫిడేలు వాయిద్యములో మహా ఘనులు. 1862 సం॥రం దుర్మతి సంవత్సర చాపమాస కృష్ణదశమినాడు ప్రాతఃకాలమున, సంధ్యావార్చి దత్తమనుచు సంగీ వదని తానిక రెండు గంటలలో శ్రీపురి కేగెద నని చెప్పెను. జనులందరు గూడిరి. ఉడయర్ పలాయంరాజుగారు గూడా వచ్చి మీకు ఏమైన కోర్కెలవా యని ప్రశ్నించగా (శ్రీ సుబ్బరాయశాస్త్రి) అంబకు నాపై సంపూర్ణ కటాక్షము గలిగియుండ నాకు యేమి కావలయును అని శ్రీవారు చెప్పిన నిర్ణీత కాలమునకే శ్రీపురి కేగిరి. వీరి కుటుంబమునకు ఆ రాజుగారు చాలా చాలా, సహాయపడుచుండెడివారు. వీరియొక్క అంతేవాసులు (శిష్యులు) అన్నస్వామిశాస్త్రి, కంచి కాశీశాస్త్రి మొదలగువారు.

17. శ్రీ వీణ కుప్పయ్యర్:— వీరు 19-వ శతాబ్దమువారుగా తెలియుచున్నది. వీరు సామవేద బ్రాహ్మణోత్తములు. భారద్వాజస గోత్రీకులు. శ్రీ త్యాగరాజయ్యగారి ప్రియశిష్యులు. తండ్రి పేరు సాంబమూర్తిశాస్త్రిగారు. వీరు నారాయణగౌళరాగము పాడుటయందు మహాగొప్ప గాయకులు. అందువలన నారాయణగౌళ కుప్పయ్యర్ అను పేరుగూడ గలదు. వీరు ఫిడేలు జంత్రముగూడా చాలా గొప్పగా వాయించువారు. సంగీతరత్నావళి, పల్లవి స్వరకల్పవల్లి అను రెండు గ్రంథములు రచించి యుండిరి. వీరికి గాన చక్రవర్తి యను బిరుదుగూడా గలదు. వీరు మహాభక్తులు. కులదైవము రాధా రుక్మిణీసమేత శ్రీ వేణుగోపాలస్వామి. అందువలన గోపాలదాస, అను ముద్రతో అనేక కృతులు రచించిరి. మరియు తానవర్ణములు

కూడా రచించియుండిరి. వీరు కొవ్వూరు సంస్థాన సంగీత విద్వాంసులు. మద్రాసు యందు సంగీతవ్యాప్తి చేసియుండిరి. వీరికి ముగ్గురు కుమారులు గలరు కృష్ణస్వామి, రామస్వామి, త్యాగయ్యర్ గార్లు గురువుగారు యింటలేని సమయములో వారి వీణను కృష్ణయ్యర్ వాయించినందున కోపమునకు పాత్రులై క్షమింపబడిరి. వీరియొక్క తండ్రిగారు గొప్ప వైణికులు వీరికి సాంబకు. (సాంబమూర్తిశాస్త్రి) వాయించవలె సాంబుడు (శివుడు దైవము) వినవలెనని కూడా గలదు.

18. శ్రీ మైసూరు సదాశివరావు:— వీరు మహారాష్ట్ర బ్రాహ్మణోత్తములు. మైసూరు సంస్థాన ఆస్థాన విద్వాంసులు. వాలాజాబాద్ వెంకటరమణ భాగవతారు గారి శిష్యులు. అనేక కృతులు, వర్ణములు, తిల్లానాలు సంగీత ముద్రతో వ్రాసిరి వీరికృతులలో అనేకము స్వరసాహిత్యములను గలిగియుండుటచే మిక్కిలి రంజకములుగా యుండియున్నవి.

19 శ్రీ పట్నం సుబ్రహ్మణ్యయ్యర్:— వీరు 1845 1902 సం॥రముల ప్రాంతములవారు అష్టసహస్ర బ్రాహ్మణోత్తములు. సామాన్య కవులలో గొప్పవారు. మొట్టమొదట వీరు మేళత్తూరు శ్రీ గణపతిశాస్త్రి గారియొద్ద సంగీత విద్య నభ్యసించి పిమ్మట మానంబు చావడి శ్రీ వెంకట సుబ్బయ్యర్ గారివద్ద అభివృద్ధి పొందిరి మొదట వీరి గాత్రము మహా కఠినము, ఎక్కువ సాధనపై గాత్రము మెరుగుపడి వచ్చినది. నూట ఎనిమిది తాళములలో, నూట ఇరువది యెనిమిది అక్షర కాల ప్రమాణముల, సింహానందన తాళమున పల్లవి కూర్చి పాడిన మహాఘనుడు తాళ జ్ఞానములో వీరికి సమకాలికులు ఆ రోజులలో లేరని తెలియుచున్నది మొదట తిరువయ్యారులో నివసించియుండిరి. పిమ్మట కొంత కాలమునకు చెన్నపట్టణము నివాస మేర్పాటు చేసికొని యుండిరి. అందువల్ల పట్నం శ్రీ సుబ్రహ్మణ్యయ్యర్ యని నామముతో పిలువబడిరి. వీరికి 31-వ సంవత్సరములో వివాహమై యున్నది కృతులు తానవర్ణములు, జావళీలు, తిల్లానాలు, మొత్తం షుమారు నూరు రచించి వ్రాసి యుండిరని తెలియుచున్నది. బేగడరాగము వీరి స్వంతసొమ్ము. శ్రీ త్యాగరాజయ్య గారి రచన ననుసరించి, వీరు కృతులను వ్రాసి యుండిరి. రాగభావమును విశదీకరించుచూ గానముచేయువారు. వీరియొక్క రచనలు, వేంకటేశ్వర యనుముద్రతో, తెనుగు, అరవము, సంస్కృతములందు రచించి యుండిరి. వీరియొక్క ముఖ్యమైన అంతేవాసులు (శిష్యులు) రామనాడ్ శ్రీ శ్రీనివాసయ్యంగారు, మొదలగువారు.

20. శ్రీ పల్లవి శేషయ్యర్:— వీరు తెనుగు మురికినాటి బ్రాహ్మణోత్తములు. సేలంజిల్లా, సెయ్యక్కరపట్టి గ్రామకాపురస్తులు. లక్షణలక్ష్యవిద్వాంసులు. మహాగొప్ప పల్లవిపాటకులు. శ్రీరామభక్తులు. ఎవరును పాడలేనట్లుగా

సావేరి రాగమును ఎనిమిది గంటల కాలము పాడి లోగడ సావేరి రాగము పాడిన వారిని నోడించిరి. వీరు శ్రీ త్యాగరాజయ్య గారి శిష్యుడగు సుబ్బయ్యర్ కుమారులు. అనేక కృతులు, వర్ణములు, తిల్లానాలు తమ స్వంత ముద్రతో రచించిన మేటి.

1, అరవ పదములు రచించిన కవులున్నూ, 2, ఆంధ్ర పదములు రచించిన కవుల వివరము:—1. అరవమున పదములు రచించినవారు:. శ్రీ వైదీశ్వరన్ కోవిల్, శ్రీ సుబ్బరామయ్యర్, శ్రీ ముత్తుతాండవరు, శ్రీ పాపవినాశ మొదలియార్, శ్రీ ఘనంకృష్ణయ్య, శ్రీ శంకరాభరణం నరసయ్య మొదలగువారు, 2. ఆంధ్రపదములు రచించినవారు:- కైలాసపతి ముద్రతో, శ్రీ ఘటశల్లవివారున్నూ. బొల్లవరము ముద్రతో, శ్రీ బొల్లపురమువారున్నూ, జటపల్లి గోపాలముద్రతో, శ్రీ జటపల్లివారున్నూ, శోభనగిరి ముద్రతో, శ్రీ శోభనగిరివారున్నూ, వినుకొండ విజయరామ ముద్రతో, శ్రీ ఇనుకొండవారున్నూ, రామాపురముద్రతో, శ్రీ శివరామపురమువారున్నూ, వేణంగి ముద్రతో, శ్రీ వేణంగివారున్నూ, మల్లిఖార్జున ముద్రతో, శ్రీ మల్లిఖార్జునుడున్నూ, మువ్వగోపాల ముద్రతో, శ్రీ క్షేత్రజ్ఞులు, వీరందరు 17-వ శతాబ్దములోనివారు. మరియు పై కవులందరు ఆంధ్రదేశమున తైలింగ్య బ్రాహ్మణోత్తములై యుండిరి.



ఓం

శ్రీ ర స్తు

క్రొత్త

# సంగీత విద్యాదర్పణము



## 1. సంగీతోత్పత్తి

శ్లో॥ ఓంకారంచ పరబ్రహ్మ యావదోంకార సంభవః!
అకారో కారమాకార ఏతే సంగీత సంభవాః॥

శ్లో॥ అకారో విష్ణురూపంచ ఉకారో బ్రహ్మరూపకం
మకారోభర్గ రూపంచ సర్వమోంకార రూపకం॥

తా॥ ఓంకారము పరబ్రహ్మస్వరూపము. ఆఓంకారమునందే యావత్తుజగము పుట్టెను. అందులో అకార, ఉ కార, మ కారములనే మూడక్షరములవలన సంగీతము పుట్టెనని భావము. ♦ అందు అకారము విష్ణు స్వరూప మనియు, ఉకారము బ్రహ్మ స్వరూపమనియు, మ కారము రుద్రస్వరూప మనియు, ఈ త్రిమూర్తుల స్వరూపమే ఓంకార మని యర్థము.

## 2. సంగీత విభాగము

శ్లో॥ మార్గదేశివిభాగేన సంగీతం ద్వివిధం మతమ్
ద్రుహిణేనయదుద్దిష్టం యదుక్తం భరతేనచ॥

శ్లో॥ తత్తద్దేశీయ యారీత్యా యత్స్యాల్లోకానురంజనమ్
దేశే దేశేను సంగీతం తద్దేశీత్యభిధీయ్యతే॥

తా॥ సంగీతము మార్గమని, దేశి యని రెండు విధములు. అందు మార్గము అనగా ఈశ్వర ప్రణీతమై భరతఋషిచే ప్రకటింపబడిన సంగీతము మార్గమనంబడును. దేశి అనగా, ఆ యా దేశసంబంధమగు రీతిచే, ఆయా దేశపు జనులను రంజింపగా సంగీతము దేశి అనంబడును.

## 3. సంగీత శబ్దార్థము

శ్లో॥ గీతవాదిత్ర నృత్యానాం త్రయం సంగీత ముచ్యతే॥

తా॥ గీత, వాద్య, నృత్యముల చేరికయే సంగీత మనంబడును.

అన్యశ్చ రాగస్వరశ్చ తాళశ్చ త్రిభిః సంగీత ముచ్యతే॥

తా॥ రాగము, స్వరము, తాళములనే మూటి చేరికయు సంగీత మనంబడును.

## 4. సంగీత ఫలితార్థం

శ్లో॥ త్రివర్గఫలదా స్సర్వే దాన యజ్ఞ జపాదయః
ఏకం సంగీత విజ్ఞానం చతుర్వర్గ ఫలప్రదమ్॥

శ్లో॥ హరీశాదిస్తుతౌ ధర్మో ధనకామౌ నృపాదితః
నిష్కామ స్తదనుష్ఠానా న్మోక్షమాప్నోత్య సంశయమ్॥

తా॥ దాన యజ్ఞ జపాదు లన్నియు, ధర్మార్థ కామము లనే త్రివర్గఫలములనిచ్చును ఒక్క సంగీత జ్ఞానమువలన ధర్మార్థ కామమోక్షములనే చతుర్వర్గఫలము నిచ్చును. హరిహరాదులను స్తోత్రము చేసినందువలన ధర్మము, రాజులు మొదలగువారివలన ధన కామములను గలుగును. ధన కామాపేక్షలేక కీర్తనలు భగవంతుని గూర్చి సంగీతానుష్ఠానము చేసినయెడల మోక్షమును నిస్సందేహముగ పొందుచున్నాడు.

## 5. నాదోత్పత్తి

శ్లో॥ ఆత్మా వివక్షమాణోయం మనః ప్రేరయతే మనః
నాభిస్థవహ్ని మాహంతి స ప్రేరయతి మారుతమ్

శ్లో॥ బ్రహ్మగ్రంధిస్థితోనాదః క్రమాదూర్ధ్వ పథేచరన్
నాభిహృత్కంఠ మూర్ధాస్యే ష్వావిర్భవతి సద్ధ్వనిః
నాదేతిసూక్ష్మశ్చ పుష్టోపుష్టశ్చ కృత్రిమః
ఇతి పంచభిధాందత్తే పంచస్థానస్థితః క్రమాత్॥

తా॥ తనచేత విచారింపబడిన యీ యాత్మమనస్సును ఉద్బోధించును. ఆ మనసు నాభియందున్న అగ్నిని కొట్టును. ఆ యగ్ని వాయువును ప్రేరేపించును. ఆత్మ, మనస్సు, అగ్ని, వాయువు ఈ నాలుగున్ను కారణములై నాదమును బుట్టించును. బ్రహ్మగ్రంధియందున్న ఆనాదము ఊర్ధ్వముఖముగా సంచరించుచు క్రమముగా నాభి, హృదయము, కంఠము, మూర్ధము, ఆస్యము, వీటియందు పుట్టుచున్నది. ♦ ఈ నాదము నాభియందు అతి సూక్ష్మముగను, హృదయమందు సూక్ష్మముగను, కంఠమునందు పూర్ణముగను, శిరమునందు అపూర్ణముగను, ఆస్యమందు కృత్రిమముగను పుట్టుచున్నది.

## 6. నాదలక్షణము

శ్లో॥ ననాదేన వినాగీతం ననాదేన వినాస్వరః
ననాదేన వినారాగ స్తస్మాన్నా దాత్మకం త్రయమ్॥

శ్లో॥ గీతంనాదాత్మకం వాద్యం నాదంవ్యక్త్యం ప్రశస్యతే
తద్వయానుగతం నృత్యం నాదాధీన మతి స్త్రియమ్॥

శ్లో॥ నాదేనవ్యజ్యతేవర్ణః పదంవర్ణాత్ప దాద్వచః
వచసోవ్యవహారోయ్యయం నాదాధీన మతోజగత్॥

శ్లో॥ నాదోపాసనయాదేవా బ్రహ్మవిష్ణు మహేశ్వరాః
భవంత్యుపాసితానూనం తస్మాదేతే తదాత్మకాః॥

తా॥ గీతము, స్వరము, రాగము ఈ మూడున్ను నాదమును విడిచియుండవు గాన ఇవి నాదాత్మంబు ♦ గీతము నాదాత్మకము, వాద్యము నాదముయొక్క వివరణచే ప్రకాశింపబడుచున్నది. నృత్యము గీతవాద్యముల ననుసరించి

యున్నదిగాన, నీ మూడును నాదాధీనము. నాదము వలన అక్షరమును, అక్షరముచే పదమును, పదముచే వాక్యమును, వాక్యముచే లోకవ్యవహారమును. అగుటవలన వీటితో కూడిన యీ సజ్జగత్తు నాదాధీనము. అట్టి నాదము నుపాసించుటచే బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ముగ్గురున్ను ఉపాసింపబడిన వారగుచున్నారు గాన, ఈ త్రిమూర్తులున్ను నాదాత్మకులు.

## 7. నాదశబ్దార్థము

శ్లో॥ నకారం ప్రాణనామానం దకారం మనలంవిదుః
జాతః ప్రాణాగ్నిసంయోగాత్తేన నాదోభిధీయతే॥

తా॥ నాద మను రెండక్షరములలో 'న' అను యక్షరము ప్రాణమని ప్రసిద్ధమై యుండును. 'ద' అను యక్షరము అగ్నిరూపమని చెప్పఁబడినది. ఈ కారణము చేత ప్రాణాగ్నులయొక్క సంయోగమువలన 'నాద' మను శబ్దమాయెను.

## 8. నాద విభజన

శ్లో॥ ఆహతో నాహతచ్చేతి ద్వేధానాదోనిగద్యతే
తత్రచానాహతంనాద మేకాగ్రన్య సమానసాః॥

శ్లో॥ గురూపదిష్ట మార్గేణమహంత్తః పర్యుపాసతే
దశర క్తివిహీనత్వాన్న మనోరంజకోన్నృణాం॥

శ్లో॥ తస్మాదాహతనాదస్య శృత్యాదిద్వారతోఖిలమ్
జ్ఞేయంవితన్వతే లోకరంజనమ్ భవ భంజనమ్।

తా॥ నాదము 'ఆహతము', 'అనాహతము' అని రెండు విధములు. అందులో అనాహత నాదము నిశ్చల మనస్సు గలవానికే సాధ్యము. ఈ అనాహత నాదమును గురువులచే నుపదేశింపఁబడిన మార్గముచేత ఋషు లుపాసించుచున్నారు. అది యును రక్తిలేకపోవుటచే జనులకు మనస్సంతోషము గలుగదు గాన ఆహత నాదమును శృత్యాది ముఖముగా తెలిసికొనినయెడల జనులకు ఆనందమును, పాపనాశనమును సంపూర్ణముగా చేయుచున్నది.

## 9. నాదవ్యవహారము

శ్లో॥ వ్యవహారేత్వసౌత్రేధా హృదిమంద్రోభిధీయతే
కంఠేమధ్యోమూర్ధ్నితారో ద్విగుణశ్చోత్తరమ్।

తా॥ ఈ నాదము హృదయమునందున్నప్పుడు 'మంద్ర' మనియు. కంఠమందున్నప్పుడు 'మధ్య' మనియు, మూర్ధమందున్నప్పుడు 'తార' మనియు చెప్పఁబడును. హృదయ కంఠ మూర్థము లను మూడుస్థానములందు నేయే ప్రమాణముగా నుండునో ఆ నాదము ఒకదానికంటె నొకటి ఎక్కువగల దైయుండును. కనుక వీనికే మంద్ర మధ్య తారములని పేరు కలిగియున్నది.

## 10. శ్రుతి లక్షణము

శ్లో॥ ప్రథమశ్రవణాచ్ఛబ్ద శ్శ్రూయతే హ్రస్వమాత్రకః
సాశ్రుతిస్సంపరిజ్ఞేయా స్వరావయవలక్షణా॥

శ్లో॥ శ్రుతిభ్యశ్చస్వరాష్షడ్జ రిషభగాంధారమధ్యమాః
పంచమోధైవతశ్చాథ నిషాద ఇతిసప్త తే॥

శ్లో॥ శ్రుతిభ్యస్స్యుఃస్వరాస్సర్వే స్వరేభ్యో గ్రామసంభవః
గ్రామేభ్యోజాతయోజాతః జాతిభ్యోరాగసంభవః

తా॥ శ్రుతియనగా శ్రవణమువల్ల ముందుగా నేశబ్దము వినబడుచున్నదో అది షడ్జమము మొదలగు స్వరావయవలక్షణముగల హ్రస్వమాత్రక శబ్దవిశేషము శ్రుతియనంబడును, అట్టి శ్రుతులవలన షడ్జమము, రిషభము, గాంధారము, మధ్యమము, పంచమము ధైవతము, నిషాదము లను సప్త స్వరములు కలిగెను. ఈ సప్తస్వరముల వలన గ్రామములును, గ్రామముల వలన జాతులును, జాతుల వలన రాగములును బుట్టుచున్నవి.

## 11. స్వరోత్పత్తికి ప్రధాన శ్రుతులు

శ్లో॥ దీప్తాయతాచకరుణా మృదుర్మధ్యేతిజాతయః
శ్రుతీనాం పంచతాసాంచ స్వరేష్వేవం వ్యవస్థితః॥

తా॥ దీప్త, ఆయత, కరుణ, మృదు, మధ్య అని శ్రుతి 5 జాతులు గలవి. ఆ జాతులు 22 భేదంబులై సప్తస్వరములయందు వ్యవస్థితి గలిగియుండును.

## 12. ద్వావింశతి శ్రుతులు

అనగా 22 శ్రుతులు

శ్లో॥ చతుశ్చతుశ్చతుశ్చైవ షడ్జమధ్యమపంచమాః
ద్వేద్వే నిషాదగాంధారౌ త్రిస్త్రీరిషభధైవతౌ ॥

తా॥ షడ్జమమునకు నాలుగు శ్రుతులను, ఋషభమునకు మూడు శ్రుతులును, గాంధారమునకు రెండు శ్రుతులను, మధ్యమమునకు నాలుగు శ్రుతులును, పంచమమునకు నాలుగు శ్రుతులును, ధైవతమునకు మూడు శ్రుతులను, నిషాదమునకు రెండు శ్రుతులును ఇవ్విధంబున స్వరము లేడింటికి శ్రుతులు ఇరువదిరెండు కలిగి, యుండును.

## 13. ద్వావింశతి శ్రుతులకు గల పేర్లు

శ్లో॥ తీవ్రా కుముద్వతీ మందా ఛందోవత్యస్తు షడ్జగాః
దయావతీ రంజనీచ రతికా ఋషభస్థితాః॥

శ్లో॥ రౌద్రీ క్రోధీచ గాంధారే వజ్రికాథ ప్రసారిణీ
ప్రీతిశ్చ మార్జనీత్యేతాః శ్రుతయో మధ్యమాస్థితాః॥

శ్లో॥ క్షితిరక్తాచ సందీపి న్యాలాపిన్యపి పంచమే
మదంతి రోహిణీ రమ్యేత్యేతా స్తిస్రస్తు ధైవతే॥

శ్లో॥ ఉగ్రాచ క్షోభిణీతి ద్వే నిషాదే వసతః శ్రుతీ
ఇత్యేతాసత్యసుప్రోక్తా సర్వేషుశ్రుతయోబుధైః॥

తా॥ షడ్జమమునకు తీవ్ర, కుముద్వతి, మంద ఛందోవతియను 4 శ్రుతులును, రిషభమునకు దయావతి, రంజని, రతికయను 3 శ్రుతులును, గాంధారమునకు రౌద్రి క్రోధయను 2 శ్రుతులును మధ్యమమునకు వజ్రిక, ప్రసారిణి, ప్రీతిమార్జని యను

4 శ్రుతులును, పంచమమునకు క్షితి, రక్త, సందీపని, ఆలాపిని యను 4 శ్రుతులును ధైవతమునకు మదంతి, రోహిణి, రమ్య యను 3 శ్రుతులును, నిషాదమునకు ఉగ్ర, క్షోభిణి యను 2 శ్రుతులను కలిగియుండును.

## 14. శ్రుతిజాతి భేదములు

శ్లో॥ దీప్తాయతామృదుర్మధ్యే షడ్జస్యా ఋషభేపునః
సంస్థితాః కరుణామధ్యే మృదుర్గాంధార కేపునః॥

శ్లో॥ దీప్తాయతామధ్యమేచ మృదుర్మధ్యేచ సంస్థితే
మృదుర్మధ్యాయతేఖ్యాతా కరుణా పంచమే స్థితాః॥

శ్లో॥ కరుణాచాయతామధ్యా ధైవతేస ప్త మీపునః
దీప్తామధ్యేతితాసాంచ శ్రుతీనాం బ్రూమహేభిదామ్॥

తా॥ షడ్జమమునకు దీప్త, ఆయత, మృదు, మధ్య జాతులయందును, రిషభమునకు కరుణ, మధ్య, మృదు జాతులయందును, గాంధారమునకు దీప్త, ఆయత జాతులయందును, మధ్యమమునకు దీప్త, ఆయత, మృదు, మధ్యజాతులయందును పంచమమునకు మృదు, మధ్య, ఆయత, కరుణ జాతులయందును. ధైవతమునకు కరుణ, ఆయత, మధ్య, జాతులయందును, నిషాదమునకు దీప్త, మధ్య జాతులయందును, శ్రుతులు కలిగియుండును.



## 15. ద్వావింశతి శ్రుతిజాతి విమర్శనఫలకము

| సంఖ్య | సప్త స్వరములు | శ్రుతులు | జాతులు |
|---|---|---|---|
| 1 | ,, | తీవ్ర | దీప్త |
| 2 | ,, | కుముద్వతి | ఆయత |
| 3 | ,, | మంద | మృదు |
| 4 | స | ఛందోవతి | మధ్య |
| 5 | ,, | దయావతి | కరుణ |
| 6 | ,, | రంజని | మధ్య |
| 7 | రి | రతిక | మృదు |
| 8 | ,, | రౌద్రి | దీప్త |
| 9 | గ | క్రోధ | ఆయత |
| 10 | ,, | వజ్రిక | దీప్త |
| 11 | ,, | ప్రసారిణి | ఆయత |
| 12 | ,, | ప్రీతి | మృదు |
| 13 | మ | మార్జని | మధ్య |
| 14 | ,, | క్షితి | మృదు |
| 15 | ,, | రక్త | మధ్య |
| 16 | ,, | సందీపిని | ఆయత |
| 17 | ప | ఆలాపిని | కరుణ |
| 18 | ,, | మదంతి | కరుణ |
| 19 | ,, | రోహిణి | ఆయత |
| 20 | ధ | రమ్య | మధ్య |
| 21 | ,, | ఉగ్ర | దీప్త |
| 22 | ని | క్షోభిణి | మధ్య |

శ్లో॥ గీతప్రధానం ప్రవదంతినృత్తం నృత్తప్రధానం ప్రవదంతివాద్యం
నృత్తగీతవాద్యచయప్రధానంతత్తాళమాద్యం ప్రణమామినిత్యమ్॥

టీక॥ గీతప్రధానం ప్రవదంతివృత్తం = అనగా గీతము నృత్తానకు ప్రధానమై యుండును. నృత్తప్రధానం ప్రవదంతివాద్యం = అనగా నృత్తమునకు ప్రధానమైనవి వాద్యము, నృత్తగీతవాద్యచయ ప్రధానం తత్తాళమాద్యం ప్రణమామి నిత్యం = అనగా నృత్తగీతవాద్యములకు తాళము ప్రధానమై యుండును. తత్ = అటువంటి తాళమును, నిత్యం = నిత్యమున్ను, ప్రణమామి = నమస్కరించెదను.

తాళస్వరూపము ప్రతిపాదించుట వలనను తెలియుటవలనను
గలుగు ఫలమేమనగా చెప్పఁబడుచున్నది.

శ్లో॥ తౌర్య త్రికనిదానంచ తాళం కాలస్వరూపిణమ్
దశప్రాణ సమోపేతం యోజనాతి సతత్వవిత్

తా॥ నృత్తగీత వాద్యములకు ఆదికారణమైనదియు కాలాదిదశప్రాణయులతో గూడినదియు, కాలస్వరూపమైనతాళమును ఎవరు తెలియుదురో వారు సర్వేశ్వర రూపమును తెలిసిన వారగుదురు. గాన, తాళస్వరూపము అవశ్యము తెలిసి యుండవలెనని తెలియంగునది.

శ్లో॥ శివశక్త్యాత్మకం పుణ్యం యశస్యం భుక్తిముక్తిదమ్
దశప్రాణాత్మకం తాళం యోజానాతి సతత్వవిత్ ॥

తా॥ శివశక్తిస్వరూపంబును ఫలితంబును కీర్తికరంబును భుక్తిముక్తి ప్రదంబును, దశప్రాణసహితంబును నగు తాళమును ఎవరుతెలియుదురో వారు సర్వేశ్వర రూపము తెలిసిన వారగుదురు. గనుక తాళస్వరూపము ముఖ్యముగా తెలిసి యుండవలెనని తెలియంగునది.

శ్లో॥ గీతంవాద్యంచ నృత్యంచ తాళహీనంనరాజితే

తా॥ గీతవాద్యనృత్తములు తాళములేకున్న ప్రకాశింపవు.

శ్లో॥ లోకేవేదేచ వచసాం పాదయోర్గతి రుత్తమా
తాళేనైవ వినా తేన స్ఖలనం తేషు దృశ్యతే॥

తా॥ లౌకికమందును, వైదికమందును, వాక్యములయందును పాదములయొక్క వ్యాపారము తాళముచేతనే తిన్నగా ప్రవర్తించును. ఆ తాళములోద వెదజాపిన

యెడల ఆ లౌకికవైదిక వాక్యములయందును, ఆ లౌకికవైదిక పాదగతుల యందును తొట్రుబాటు కానబడుచున్నది.

శ్లో॥ తౌర్యత్రికం తాళహీనం చాలయే త్పురుషాధమః
సపాపి నరకం ఘోర మాశు గచ్ఛతి సాన్వయః ॥

తా॥ ఎవరైనను నృత్తగీతవాద్యములను తాళానుగుణము గాకుండునటుల కొలి పించునో, వాడు పురుషాధముడనియు, పాపాత్ముడనియు వంశమువారితో గూడా ఘోరమైన నరకమును శీఘ్రముగా బొందును. కావున, సకల లౌకిక వ్యాపారములకున్ను తాళము ఆవశ్యము గనుక తాళస్వరూపము నిరూపించేది. యుక్తమని సిద్ధాంతము.

## —* తాళశబ్దవ్యుత్పత్తి *—

శ్లో॥ తాళ స్తలప్రతిష్ఠాయా మితి ధాతో ర్ఘఞిస్మృతః ।

తా॥ తల అనెడి ధాతువు ప్రతిష్ఠయందు వచ్చును. ఆ తల యనెడి ధాతువుమీద ఘ ప్రత్యయంబును అదివృద్ధియు కాగా తాల, అని నిలచెను. అటుమీదట ను ప్రత్యయమును, ఋత్వవిసర్గలు రాగా తాళః అనెడి శబ్దము ఏర్పడెను ఈ తాళశబ్దానకు వ్యుత్పత్తి (తలంతి తిష్ఠంతి గీతవాద్యనృత్తాని) అత్రేతి తాళః = అనగా గీతవాద్యనృత్తములు, అత్ర=ఈతాళమందు తలంతి=నిల్పగా నున్నవి. అనెడి అర్థమందు తాళః=తాళశబ్దము వచ్చును. ఈ తాళశబ్దానకు మరియొక వ్యుత్పత్తి చెప్పబడుచున్నది. తల్యంతే ప్రకాశ్యంతే నృత్తగీత వాద్యాని యేనేతివానతాళః = నృత్తగీత వాద్యములు దేనిచేత ప్రకాశింపం బడునో అది తాళము, అను నీ రెండు వ్యుత్పత్తులచేతను, తాళశబ్దమునకు అర్థము తెలియందగినది. ఈ తీరునానే సంగీత రత్నాకరమందు శార్ఙ్గదేవుడు

తాళశబ్దానకు వ్యుత్పత్తిన్ని అర్థమున్ను చెప్పియున్నాడు.

శ్లో॥ తాళ స్తలప్రతిష్ఠాయా మితి ధాతోః ప్రయోగతః
నృత్తిగీతం తథా వాద్యం యతస్తాళే ప్రతిష్ఠితం ।

తా॥ తలప్రతిష్ఠాయాం అనెడి ధాతువుయొక్క ప్రయోగమువలన తాళశబ్దము పుట్టి నది. ఈ తలధాతువు, ప్రతిష్ఠార్థతమగుటచే నృత్తగీత వాద్యములు తాళమందు ప్రతిష్ఠితమై యున్నవి. కావున తాళశబ్దముయొక్క వ్యుత్పత్తియు, అర్థమున్ను ఇటుని తెలిసికొనునది.

శ్లో॥ తకారశ్శం కరః ప్రోక్తో లకార శ్శక్తి రుచ్యతే
శివశక్తి సమాయోగా త్తాళనామాభిధీయతే॥

తా. తకారమునకు అధిదేవత శంకరుడును, లకారమునకు అధిదేవత పార్వతియు నగుటచే, ఈ పార్వతీ పరమేశ్వరులయొక్క సంయోగమువలన తా ళ అనెడి శబ్దము పుట్టెనని చెప్పబడుచున్నది. అనగా అర్ధనారీశ్వరు కరతలద్వయ మగుటచే, కుడిహస్తము శివస్వరూపమనియు, ఎడమహస్తము పార్వతీ స్వరూపమనియు, ఈ రెండు హస్తములయొక్క సంయోగమువలన తాళమను శబ్దము బుట్టెనని భావము.

శ్లో॥ హస్తద్వయస్య సంయోగే వియోగేచాపి వర్తతే
వ్యాప్తిమాన్యో దశప్రాణై స్సకాల స్తాళసంజ్ఞకః॥

తా॥ రెండు హస్తములకును, సంయోగేచ=సశబ్ద క్రియయు, వియోగేచ=నిశ్శబ్ద క్రియయు గలిగి దశప్రాణములతో గూడుకొని వర్తించెడి యే కాలముగలదో అది తాళమనఁబడును.

శ్లో॥ కాలః క్రియాచ మానంచ సంభవంతి యదా సహ
తదా తాళస్య సంభూతి రితిజ్ఞేయం విచక్షణైః
కాలః క్షణాదికో జ్ఞేయ స్తాళయో ర్ఘటనం క్రియా
క్రియయోరంతరం యత్తువిశ్రామో మాన ముచ్యతే॥

తా॥ కాలము, క్రియ, మానము అను నీ మూడును చేరి ఎప్పుడు ఏకకాలమునందు కలుగుచున్నవో అప్పుడు తాళమునకు ఉత్పత్తి యని తెలియఁగునది. క్షణాదికము, కాలమని వ్యవహరింపఁబడును. కొట్టబడిన రెండు వస్తువుల చేరిక క్రియ యనంబడును. క్రియలకు మధ్యనుండు విశ్రాంతికాలము మానమని చెప్పబడును.

శ్లో॥ మార్గదేశీ గతత్వేన తాళోసా ద్వివిధోమతః
శుద్ధసాలగ సంకీర్ణా స్తాళభేదాః క్రమాన్మతాః॥

తా॥ మార్గము, దేశి అని తాళము రెండు విధములు. అది యొక్కొక్కటి శుద్ధము, సాలగము, సంకీర్ణము, అని మూడు విధంబులై యున్నవి.

## తాళదశ ప్రాణములు

శ్లో॥ కాలోమార్గః క్రియాంగాని గ్రహో జాతిః కళాలయః
యతిః ప్రస్తారకశ్చేతి తాళప్రాణాదశస్మృతాః ॥

తా॥ కాలము, మార్గము, క్రియ, అంగము, గ్రహము, జాతి, కళ, లయ, యతి, ప్రస్తారము, అను నీపదిన్ని తాళమునకు ప్రాణములు.

## 1. కాల ప్రాణలక్షణము

శ్లో॥ ఉపర్యు పరివిన్యస్యాత్పద్మపత్రం శతం సకృత్
యః కాలస్సూచి సంభేధాత్ క్షణంచ పరికీర్తితః
లవక్షణై రష్టభిస్స్యా త్కాష్ఠాప్యష్టలవాత్మకైః
అష్ట కాష్ఠనిమేషస్స్యా న్నిమేషై రష్టభిఃకళాః
కళాభ్యాంతు చతుర్భాగో చతుర్భాగ మనుద్రుతమ్
అనుద్రుతౌచ బిందుస్స్యాద్బిందుభ్యాంచ లఘుర్భవేత్
లఘుద్వయం గురుశ్చైవ త్రిలఘుప్లుత ముచ్యతే
చాతుర్లఘుంచ కాకపాదం ఇత్యేతత్కాల లక్షణమ్॥

తా॥ నూఱు తామర రేకులను ఒకటిమీద నొకటిచొప్పున దొంతరగాజేర్చి సూదిచే పొడవగా రేకులన్నియు తెగినంత కాలము పేరు క్షణ మనంబడును. అట్టి క్షణములు ఎనిమిదైతే ఒక లవమని పేరు. ఆలవములు ఎనిమిదైతే ఒక కాష్ఠకము. ఆ కాష్ఠలు ఎనిమిదైతే ఒక నిమిషము. ఆ నిమిషములు ఎనిమిదైతే ఒక కళ. ఆ కళలు రెండైతే ఒక చతుర్భాగము. ఆ చతుర్భాగములు రెండైతే ఒక అనుద్రుతము. అట్టి అనుద్రుతములు రెండయితే ఒక ద్రుతము. ద్రుతములు రెండయితే ఒక లఘువు. లఘువులు రెండయితే ఒక గురువు. ఆ లఘువులు మూడయితే ప్లుతము. లఘువులు నాలుగయితే కాకపాదమగును. ఇందుచేత తాళము నిర్ణయింపబడుచున్నది. మఱియు, ఇప్పుడు అనుద్రుతము మొదలు గాగల ఆఱు అంగములు మాత్రము వాడుక యందున్నవి, కొందరు చతుర్భాగమును ఏడవ యంగముగను వాడుచున్నారు. ఇది కాలప్రాణము. ఈ

కాల ప్రాణము తాళమును సాక్షాత్ సంబంధించి యుండి తాళావకు నిర్వాహకంగాను ప్రాణమని తెలిసికొనునది.

## — 2. మార్గప్రాణలక్షణము —

శ్లో॥ దక్షిణో వార్తికశ్చిత్ర స్తతశ్చిత్రతర స్స్మృతః
తథా చిత్రతమశ్చాన్యో దతిచిత్రతమో మతః
షడేవం కథితా మార్గా స్తత్స్వరూపం నిరూప్యతే॥

తా॥ దక్షిణము, వార్తికము, చిత్రము, చిత్రతరము, చిత్రతమము, అతిచిత్రతమము అని మార్గములు ఆఱువిధములు.

శ్లో॥ తత్ర దక్షిణమార్గస్య మాత్రాష్టక ముదాహృతమ్
వార్తికేతు చతుర్మాత్రాశ్చిత్రమార్గో ద్విమాత్రకః
ఏకమాత్రశ్చిత్రతరో ద్రుత శ్చిత్రతమే మతః
అతిచిత్రతమేమార్గే నుద్రుతపరికీర్తితః॥

తా॥ దక్షిణమార్గము = అనగా, ఏతాళమునకైనను తాళాక్షర కాలమునకు ఎనిమిది మాత్రల కాలము నడుచునది.

వార్తికము = అనగా, తాళాక్షర కాలమునకు నాలుగుమాత్రల కాలము నడుచునది.

చిత్రమార్గము = అనగా, తాళాక్షర కాలమునకు రెండుమాత్రల కాలము నడుచునది.

చిత్రతరము = అనగా, తాళాక్షర కాలమునకు ఒక మాత్రకాలము నడుచునది. మాత్ర అనగా, నాలుగక్షరముల కాలము.

చిత్రతమము = అనగా, తాళాక్షర కాలమునకు ద్రుత కాలము నడుచునది. ద్రుతకాలమనగా రెండక్షరముల కాలము.

అతిచిత్రతమము = అనగా, తాళాక్షర కాలమునకు అనుద్రుత కాలము నడుచునది. అనుద్రుతకాలమనగా . ఒక యక్షరకాలము.

ఇటుల ఏతాళమునకైనను ? శాస్త్ర్యోక్త తాళాక్షరమునకు పైన చెప్పబడిన ప్రకారము అక్షరము మొదలు మరియొక అక్షరమువఱకు జరుగు కాలదీర్ఘములకు మార్గములని చెప్పబడుచున్నవి. ఇది మార్గమనెడి ప్రాణము. ఈమార్గమనెడి ప్రాణము తాళజ్ఞాపకమైన క్రియాసముదాయమునకు ఆశ్రయమగుట

చేతను తాళసంబంధి అయిన క్రియతో సంబంధించెను గాన మార్గమున్ను తాళమునకు ప్రాణమని తెలిసికొనునది.

### ౩. క్రియాప్రాణలక్షణము

శ్లో॥ మార్గదేశిగతత్వేన తత్రాద్యస్యక్రియా ద్విధా
నిశ్శబ్దా, శ్శబ్దయుక్తాచ నిశ్శబ్దాతు కళోచ్యతే॥

తా॥ క్రియలు మార్గక్రియలని, దేశ్యక్రియలని రెండువిధములు. ఆమార్గక్రియలు నిశ్శబ్దక్రియలని, శబ్దక్రియలని రెండు విధములు. అందు నిశ్శబ్దక్రియకు కళ అనే పేరు చెల్లును గనుక ఆ నిశ్శబ్దక్రియలు చెప్పఁబడుచున్నవి.

### నిశ్శబ్దక్రియలు

శ్లో॥ తత్రా వాపోథనిష్క్రామో విక్షేపశ్చ ప్రవేశనమ్
చతుర్విధాశ్చ విజ్ఞేయా నిశ్శబ్దాశ్చ క్రియాబుధైః॥

తా॥ ఆవాపము, నిష్క్రామము, విక్షేపము, ప్రవేశము, అను నీ నాలుగున్ను నిశ్శబ్దక్రియలు.

### నిశ్శబ్దక్రియల లక్షణములు

శ్లో॥ అవాపస్తత హస్తస్యోత్తానస్యాం గుళికుంచనమ్
నిష్క్రామోథ స్తలస్యాస్యా దంగుళీనాం ప్రసారణమ్।
తస్యదక్షిణ విక్షేపో విక్షేప ఇతికథ్యతే
వివర్తనంచ హస్తస్య ప్రవేశోథో ముఖస్యచ॥

తా॥ ఆవాపము అనగా, వెల్లికిలగా యెత్తబడిన పతాకహస్తముయొక్క తర్జనీ మొదలగు నాలుగు వ్రేళ్ళను ముడుచుట. నిష్క్రామము అనగా ఆముడిచిన హస్తముయొక్క వ్రేళ్ళను విప్పుట. విక్షేపము అనగా, ఆ హస్తమును తెలతల కుడిపార్శ్వమునకు విదిలించుట. ప్రవేశము అనగా, ఆ హస్తమును అప్రదక్షిణముగా క్రిందుగా ముందరికి రానిచ్చుట. ఈ నాలుగున్ను నిశ్శబ్దమార్గక్రియలు.

### శబ్దక్రియలు

శ్లో॥ ధ్రువశ్శమ్యాశ్చ తాళశ్చ సన్నిపాత ఇతిస్మృతః
ఇతిశబ్దేన సంయుక్తో విజ్ఞేయశ్చ చతుర్విధమ్॥

తా॥ ధ్రువము, శమ్యము, తాళము, సన్నిపాతము అను నీ నాలుగున్ను సశబ్దక్రియలు

—♦ సశబ్ద క్రియల లక్షణములు ♦—

శ్లో॥ రవో హస్తస్య పాతస్స్యా చ్చుటికా శబ్దపూర్వకః
శమ్యావామని పాతస్తు తాళో దక్షిణ ఘాతకః॥
ఉభయోర్హస్తయోర్ఘాత స్సన్నిపాత ఇతిస్మృతః
ఏతామార్గ క్రియాశ్చైవ కథితా భరతజ్ఞకైః॥

తా॥ ధ్రువము అనగా శబ్దపూర్వకమైన చిటికె చేయుట శమ్య అనగా కుడిహస్తమందు యెడమచేతి ఘాతచేయుట. తాళము అనగా యెడమహస్తమందుకుడి చేతి ఘాత చేయుట. సన్నిపాతము అనగా అభిముఖముగా నిలిచిన రెండు హస్తములచే సమముగా ఘాతచేయుట. ఈ నాలుగున్న సశబ్దమార్గ క్రియలు.

—♦ దేశక్రియలు ♦—

శ్లో॥ ధ్రువకా సర్పిణీకృష్యా పద్మినీచ విసర్జితా
విక్షిప్తాచ పతాకాఖ్యా పతితాష్టౌ క్రియా తథా॥

తా॥ ధ్రువక, సర్పిణి, కృష్య, పద్మిని, విసర్జిత, విక్షిప్త, పతాక, పతిత అను నీ ఎనిమిదిన్ని దేశ్యక్రియలు.

—♦ దేశక్రియల లక్షణము ♦—

శ్లో॥ సశబ్దా ధ్రువకాజ్ఞేయో స్సర్పిణీ వామగామినీ
కృష్యాదక్షిణతః పాతః పద్మినిస్యా దధోగతః
విసర్జితా బహిర్యాతా విక్షిప్తా కుంచితాత్మికా
పతాకాచోర్ధ్వ గమనా పతితాకర పాతనా॥

తా॥ ధ్రువకము అనగా సశబ్దముతో గూడిన కుడి హస్తము యొక్క ఘాతధ్రువకమనంబడును. సర్పిణి అనగా పతాక హస్తము చేత యెడమ వంకకు చేయి చాచుట. కృష్య అనగా యెడమ నుంచి కుడిపార్శ్వమునకు రానిచ్చుట. పద్మిని అనగా అరచేతి క్రిందుగా అధోముఖముగా చేయి చాచుట. విసర్జిత అనగా ఆచేతిని వెలపల విసరుట. విక్షిప్త అనగా ఆ

హస్తముయొక్క వేళ్లుముడిచి తనదిక్కుకు దీయుట పతాకము అనగా పతాక హస్తముగా బట్టిన చేతిని మీదికి ఎత్తుట పతిత అనగా ఆ మీదికి యెత్తిన హస్తమును దిగువకు దించుట ఈ ఎనిమిది దేశ్యక్రియలలో ధ్రువక అనునది మాత్రమునశబ్దక్రియ. సర్పిణి మొదలైన తక్కిన ఏడున్ను నిశబ్ద క్రియలని ఎఱుంగునది. ఇది క్రియ అనెడు ప్రాణము. ఈ క్రియలు హస్తమందు నుండుటచే తాళమునకు జ్ఞాపకము గనుక తాళప్రాణమని తెలిసికొనునది.

## 4. అంగప్రాణ లక్షణము

శ్లో॥ అనుద్రుతో ద్రుతశ్చైవ లఘుర్గురు ప్లుతస్తథా
కాకపాదం తథాప్రోక్తం తాళాంగానిచ షడ్విధమ్॥

తా॥ అంగము అనగా తాళసంఖ్యను తెలియుటకు సాధనం బగు సంజ్ఞావిశేషము అంగమనంబడును. అది అనుద్రుతము, ద్రుతము, లఘువు, గురువు, ప్లుతము, కాకపాదము అని అంగములు ఆఱు విధములు.

### అంగముల స్వరూపములు

శ్లో॥ అనుద్రుతస్య రూపంచ అర్ధచంద్ర కళాత్మకం
ద్రుతస్తు వలయాకారో లఘురర్ధ శరాకృతిః
గురుర్వక్ర ధనుర్జ్ఞేయం ప్లుతస్తు శిఖరో గురుః
ఊర్ధ్వ రేఖాచ తిర్యంచో కాకపాదః ప్రకీర్తితః॥

తా॥ అనుద్రుతము—అర్ధచంద్రునివలె నుండవలెను. ...
ద్రుతము—వలయాకారమయి యుండవలెను. ...
లఘువు—అర్ధబాణమువలె నుండవలెను. ...
గురువు—ఎక్కుబెట్టిన విల్లువలె నుండవలెను. ...
ప్లుతము—శిఖరరేఖతో గూడిన గురువువలె నుండవలెను. ...
కాకపాదము—హంసపాదమువలె నుండవలెను. ...

### షడంగముల నిఘంటు

శ్లో॥ అనుద్రుతోర్ధ చంద్రస్యాద్వ్యంజనం చాసునాళకః,
అవ్యక్తంచ విరామంచ వక్తవ్యం భరతజ్ఞకైః॥

తా॥ అను ద్రుతము, అర్ధచంద్రము, వ్యంజనము, అనునాసికము, అవ్యక్తము, విరామము అను నీ ఆఱున్ను అనుద్రుతమునకు పేళ్లు.

శ్లో॥ అర్ధమాత్రా ద్రుతం వ్యోమం బిందుకం వలయాకృతమ్।

తా॥ అర్ధమాత్రా, ద్రుతము, వ్యోమము, బిందువు, వలయము, చక్రము, అను నీ ఆఱున్నూ ద్రుతమునకు పేళ్ళు.

శ్లో॥ మాత్రస్య సరళం హ్రస్వం కళాయాంచ లఘుర్భవేత్॥

తా॥ మాత్ర, సరళము హ్రస్వము, కళ, లఘువు, శరము అను ఆఱున్న లఘువునకు పేళ్ళు.

శ్లో॥ ద్విమాత్రకం గురుర్వక్రం కాణో యమళదీర్ఘకమ్॥

తా॥ ద్విమాత్ర, గురువు, వక్రము, కాణము, యమళము దీర్ఘము అను నీఆఱున్న గురువుకు పేళ్ళు.

శ్లో॥ సమోద్భవం ప్లుతందీప్తం తథాత్ర్యంగం త్రిమాత్రకమ్॥

తా॥ సమోద్భవము, ప్లుతము, దీప్తము, త్రియంగము, త్రిమాత్ర, షకారము అను నీ యాఱున్ను ప్లుతమునకు పేళ్ళు.

శ్లో॥ కాకో హంస పాదాఖ్యో నిశ్శబ్దశ్చ చతుర్లఘుః॥

తా॥ కాకపాదము, హంసపాదము, నిశ్శబ్దము, చతుర్లఘువు, చతుర్మాత్రా చతుష్కళ, అను నీ ఆఱున్ను కాకపాదమునకు పేళ్ళు.

## అంగములు వాడేవిధము

శ్లో॥ ద్వయాంగుళో బాలచంద్రా ద్రుతస్తు చతురంగుళః
లఘురష్టాంగుళః ప్రోక్తో గురుస్యాత్షోడశాంగుళః॥
ప్లుతప్రమాణం కథితం చతుర్వింశతి రంగుళా,
ద్వాత్రింశ త్కాకపాదస్యాత్రావస్యాంగుళ నిర్ణయః॥

తా॥ అను ద్రుతము, రెండంగుళముల ప్రమాణమునను, ద్రుతము నాలుగంగుళముల ప్రమాణమునను, లఘువు ఎనిమిది అంగులముల ప్రమాణమునను, గురువు 16 అంగుళముల ప్రమాణమునను, ప్లుతము మూడు మాత్రలకు 24 అంగుళముల ప్రమాణమునను, కాకపాదము నాలుగు నిశ్శబ్ద మాత్రలకు 32 అంగుళముల ప్రమాణమునను, ఈ క్రమంబున యున్నతం తెలిసి వ్రాయ వలయును.

## అంగములకు హస్తక్రియలు వాడేవిధము

శ్లో॥ ధృవకా సర్పిణీకృష్యాప్లుతేచ పరివర్తితా
ధృవకా పతితేదీర్ఘే ధృవకాచ లఘుస్మృతః
ధృవకార్ధ ద్రుతశ్చైవ తదర్ధం మునయోవిదుః ।

తా॥ సర్పిణి, కృష్య, పతాక, పతిత అను నీనాలుగు నిశ్శబ్ద క్రియలచేత కాకపాదము వాడవలెను. ధృవక, సర్పిణి, కృష్య అను నీ మూడు క్రియలచేత ప్లుతము వాడవలెను. ధ్రువక. పతిత, అను నీ రెండు క్రియలచేత గురువు వాడదగినది. లఘువును ధృవక అనెడు క్రియచేత అష్టాంగుళ ప్రమాణముగాను, ద్రుతమును చతురంగుళ ప్రమాణముగాను, అనుద్రుతమును ద్వ్యయాంగుళ ప్రమాణముగాను వాడవలయును. అంగమనెడి ప్రాణము తాళావయవమగుచూ తాళ సంబంధి గాన, ఇది తాళప్రాణమని తెలియంగునది.

### షోడశాంగముల పేళ్ళును తదంగసంజ్ఞలును అక్షరకాలమును ఈక్రింద వ్రాయబడుచున్నవి.

| షోడశాంగముల పేర్లు. | అంగ సంజ్ఞలు. | అక్షరకాలము. |
|---|---|---|
| అనుద్రుతము ... ... | ◡ | 1 |
| ద్రుతము ... ... | ○ | 2 |
| ద్రుతవిరామము ... ... | ◡○ | 3 |
| లఘువు ... ... | । | 4 |
| లఘువిరామము ... ... | ◡। | 5 |
| లఘుద్రుతము ... ... | ○। | 6 |
| లఘుద్రుతవిరామము ... ... | ◡○। | 7 |
| గురువు ... ... | 8 | 8 |
| గురువిరామము ... ... | ◡8 | 9 |
| గురుద్రుతము ... ... | ○8 | 10 |
| గురుద్రుతవిరామము ... ... | ◡○8 | 11 |
| ప్లుతము ... ... | § | 12 |
| ప్లుతవిరామము ... ... | ◡§ | 13 |
| ప్లుతద్రుతము ... ... | ○§ | 14 |
| ప్లుతద్రుతవిరామము ... ... | ◡○§ | 15 |
| కాకపాదము ... ... | + | 16 |

## ౫. గ్రహప్రాణలక్షణము

శ్లో॥ అతీతా నాగతశ్చైవ సమశ్చ విషమోపిచ
గ్రహాశ్చతుర్విధా ప్రోక్తా తత్స్వరూపం నిరూప్యతే॥

తా॥ అతీతము, అనాగతము, సమము, విషమము అని గ్రహములు నాలుగువిధములు.

## గ్రహముల వివరణము

శ్లో॥ గీతాతీతేత్వతీతస్యా త్తాళాతీతే త్వనాగతః
గీతాయాం తాళసంయుక్తో సమగ్రహ మితీరితమ్॥
ఆద్యంతయోరనియమో విషమశ్చ ప్రకీర్తితః
మాత్రాధిక్యంచ తస్యైవ క్వచిత్తే చిత్ప్రచక్షతే॥

తా॥ గీతము నడిచిన పిమ్మట తాళము నడచుట అతీతమనంబడును. తాళము నడిచిన పిదప గీతము నడచుట అనాగత మనంబడును. తాళగీతములు సమముగా నడచుట సమ మనంబడును. ఈ మూడు విధములుగాక నడచునది విషమ గ్రహ మనంబడును. మఱియు, గీతాదులకన్నను తాళమాత్రలు రెండుగాని మూడుగాని, నాలుగుగాని, అతీతమైతే అది అతీతగ్రహమనియు, ఇన్ని మాత్రలే అనాగతమైతే అది అనాగతగ్రహమనియు, పదరు ప్రకారము 5, 6, 7, 8 మాత్రలు గీతముకంటె అతీతమైనను అనాగతమైనను అది విషమ గ్రహమనంబడును. ఇటుల రంగరాజ లొల్లభట్టులు మొదలైన భరతశాస్త్ర వ్యాఖ్యాతలు నిర్ణయించినారు.

## 6. జాతిప్రాణలక్షణము

శ్లో॥ అనుగాయా మతేర్ధర్మం కారణంజాతిరుచ్యతే॥

తా॥ అనుగతబుద్ధికి కారణమైన ధర్మము జాతియనంబడును. అనగా లోకమందు అనేక మనుష్యులయందు వీడు మనుష్యుడు అనెడి అనుగత బుద్ధిచేత మనుష్యత్వమనెడి జాతి సిద్ధించెను. ఆ తీరుననే అనేక తాళములయందు ఇదిన్ని తాళము అనెడి అనుగత బుద్ధిచేత తాళత్వమనెడి జాతి కద్దని తెలిసికొననది. ఇప్పుడు సకల మనుష్యుల యందును, మనుష్యత్వమనెడి ఒక జాతియున్నను, ఆ మనుష్యులయందు బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్ర,

త్వము కొందరైన అవాంతర జాతులు గలిగినట్లు సకల తాళములయందును తాళత్వమనెడి వ్యాపకజాతియుండి యున్నను, చతురశ్ర త్రిశ్రము కొందరైన అవాంతర జాతులు మతభేదములచేత కలవని చెప్పఁబడెను.

## జాతుల వివరణము

శ్లో॥ చతురశ్ర త్రిశ్రమిశ్రా ఖండస్సంకీర్ణక స్తథా
పంచధాజాతయ స్సర్వే తత్స్వరూపం నిరూప్యతే॥

తా॥ చతురశ్రము, త్రిశ్రము, మిశ్రము, ఖండము, సంకీర్ణము, అని ఐదు జాతులు కలవు. అవి వరుసగా 4, 3, 7, 5, 9, సంఖ్యలు గలవు.

పైన జెప్పఁబడిన బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్ర సంకీర్ణము లనెడి అవాంతర జాతుల ప్రకారము చతురశ్రజాతి బ్రహ్మజాతిగా నెంచబడెను గాన, బ్రహ్మకు చతుర్ముఖ లగుటచే చతురశ్రమనెడి జాతి ఏర్పడెను. గాన, ఆ చతురశ్రజాతికి 4 అక్షరముల లఘుకాలమాయెను. ఈ చతురశ్ర జాతియొక్క 4 అక్షరములను మూటిచే గుణించగా 12 వచ్చును. ఆ 12 ను నాలుగుపాళ్ళుచేయగా పాలు ఒక్కొంటికి 3 అక్షరములు ఏర్పడును. గాన, త్రిశ్రజాతికి 3 అక్షరముల లఘుకాలమాయెను. చతురశ్ర జాతియొక్క 4 అక్షరములును, త్రిశ్రజాతియొక్క 3 అక్షరములును, మిశ్రము సేయగా మిశ్రజాతికి 7 అక్షరముల లఘుకాలమాయెను. ఈ మిశ్రజాతియొక్క 7 అక్షరములను, త్రిశ్రముయొక్క 3 అక్షరములను కలపగా 10 అక్షరములగును. ఆ పది అక్షరములను సగముగా ఖండించగా ఏర్పడిన 5 అక్షరములు ఖండజాతికి లఘుకాలమాయెను. చతురశ్రజాతియొక్క 4 అక్షరములను త్రిశ్రమిశ్రములు కలిపి ఖండించిన ఖండజాతియొక్క 5 అక్షరములను కలపగా 9 అక్షరములు సంకీర్ణజాతికి లఘుకాలమాయెను. ఇవిగాక మరికొన్ని లఘువులు చెప్పబడియున్నవి. అవి యెవ్వియన? మనుష్యలఘువు, స్వర్గలఘువు, హంసలఘువు, దేశ్యలఘువు, చిత్రలఘువు, దివ్యలఘువు, సింహలఘువు, వర్ణలఘువు, వాద్యలఘువు, కర్ణాటకలఘువు, అని లఘువులు పదివిధములు. అవి క్రమముగా 4, 3, 7, 5, 9, 6, 8, 10, 12, 16 అక్షరకాలములు గలవైయుండును. ఈ లఘువులలో పైచెప్పబడిన 5 జాతుల లఘువులుకూడ యున్నవి.

## 7. కళాప్రాణలక్షణము

శ్లో॥ ఏక కళాచ ద్వికళా త్రికళాచ చతుఃకళా
[illegible] పంచికాచ విజ్ఞేయం తాళలక్షణ కోవిదైః॥

ఏకస్యాంచ కళాయాంతు లఘుశ్చేతి కీర్తితః
ద్వికళాయాం గురుశ్చైవ త్రికళాప్లుత ముచ్యతే
నిశ్చబ్ద లచతుష్కంచ కళాచతుష్కాభిదే ॥

తా॥ ఏకకళ, ద్వికళ, త్రికళ, చతుష్కళ, అని కళలు నాలుగు గలవు. అందు లఘువుకు ఒక కళయు, గురువుకు రెండు కళలు, ప్లుతమునకు మూడు కళలును, కాకపాదమునకు నాలుగు కళలును గలిగియుండును. చచ్చత్పుట, చాచత్పుట, షట్పితాపుత్రిక, సంపద్వేష్ట, ఉద్ఘట్టములను, ఈ 5 తాళములు కళలనంబడును.

## ౮. లయప్రాణలక్షణము

శ్లో॥ తాళాంతరాళవర్తీయః కాలోసౌలయనామకః
ద్రుతమధ్య విళంబాశ్చ భవేయుస్త్రివిధాలయాః
ద్రుతోమధ్యో విళంబశ్చ ద్రుతశ్శీఘ్రతమోమతః
ద్విగుణాద్విగుణో జ్ఞేయా తస్మాన్మధ్యవిళంబితౌ ॥

తా॥ తాళమునడుమ నడిచెడి కాలము లయ యనంబడును. అది ద్రుతము, మధ్యము విళంబితము అని త్రివిధములు. అందు మిక్కిలి శీఘ్రమయినది ద్రుతము. దానిని ఇనుమడింప మధ్యము. దానిని ఇనుమడింప విళంబితమగును. ద్రుతలయ అనగా పాడుటకు ఎంత త్వరగా తాళము వేసికొని పాడనగునో అట్లు తాళము వేసికొని పాడుట. మధ్యలయ అనగా, ద్రుతలయకు రెట్టింపు విళంబము చేయుట. విళంబితము అనగా ఆమధ్యలయకంటె రెట్టింపు విళంబము చేయుట, మరియు. (గీతతాళాదీనాం హేతుత్ర విరామోలయః) అనియు "శ్రుతిర్మాతా పితాలయః" అనియు, చెప్పియుండుటచేత లయ ముఖ్య ప్రాణ మని తెలియంగునది.

## ౯. యతి ప్రాణలక్షణము

శ్లో॥ లయప్రవృత్తినియమో యతిరిత్యభిధీయతే
సమస్రోతోవహాఖ్యాతా గోపుచ్ఛేకపిపీలికా
మృదంగికాచ విషమాషడ్విధాయతి రుచ్యతే

తా॥ యతి అనగా లయప్రవర్తయొక్క నియమము యతి యనంబడును. అవి, సమయతి స్రోతోవహాయతి, గోపుచ్ఛయతి, పిపీలికయతి, మృదంగయతి, విషమయతి అని యతులు ఆరు విధములు.

## యతుల వివరణము

శ్లో॥ ద్రుతాదీనాం సమాయత్ర సమాఖ్యాయతిరిష్యతే॥

తా॥ ద్రుతలఘు గురుప్లుతములలో యేదైనను ఽ ఽ ఽ యిట్లు సమానజాతీయము లగు అంగములు గలది సమయతి యనంబడును.

శ్లో॥ ద్రుతాదీనాం విపర్యాసా ద్యతిస్స్రోతో వహాభిదా॥

తా॥ ద్రుతలఘుగురు ప్లుతములలో నెవ్వియైనను ఇట్లు ◡ O । ఽ నదివలె ఆదియందు కొంచమై క్రమముగా గొప్పఅంగములు గలది స్రోతోవహాయతి యనంబడును.

శ్లో॥ ఆదౌ గురుప్లుతాయత్ర లఘుద్రుత లయాంతికే
గోపుచ్ఛయతి రాఖ్యాతతం తాళజ్ఞాన వినోదిన॥

తా॥ గోపుచ్ఛయతి అనగా గోవుతోకవలె ఽ । O ◡ ఇట్లు అదియందు గొప్పఅంగములున్న రానురాను తక్కువైన అంగములు గలది గోపుచ్ఛయతియనంబడును.

శ్లో॥ లఘు ద్రుతాశ్చమధ్యేస్యు రాదావంతే గురుప్లుతా
పిపీలికా యతిఖ్యాతా తాళజ్ఞాన వినోదిన॥

తా॥ పిపీలికాయతి అనగా చీమవలె ఽ । O । ఽ ఇట్లు లఘువులు గాని ద్రుతములు గాని మధ్యనుండి ఆద్యంతములందు గురువుగాని ప్లుతము గాని యుండునది పిపీలిక యతి యనబడును.

శ్లో॥ గురుప్లుతాశ్చ మధ్యేస్యు రాదావంతే లఘుద్రుతః
మృదంగయతి మిచ్ఛంతి లయజ్ఞాన వినోదిన॥

తా॥ మృదంగయతి అనగా మృదంగము వలె O । ఽ । O ఇట్లు గురుప్లుతాలలో నెవ్వియైనను మధ్య గొప్ప అంగము లుండి ఆద్యంతము లందు లఘుద్రుతము లుండునది

శ్లో॥ ఆదౌ గురుప్లుతౌ యత్ర లఘుద్రుతాదయోంతికే
విషమాయతిరస్యాతు పఠ్యతే విబుధైరపి॥

తా॥ విషమయతి అనగా ఆదియందు గురుప్లుతములుండి అంత్యమందు లఘుద్రుతము లుండెనా, అనగా పై వ్యవస్థలను సంబంధించక ౭ § । ౦ ఇటుల వ్యత్యస్తముగా అంగములుండునది విషమయతి యనంబడును.

## 10. ప్రస్తార ప్రాణలక్షణము

శ్లో॥ ప్రస్తార సంఖ్యానష్టం చోద్దిష్టం పాతాళకంస్మృతః
ద్రుతమేరుర్లఘుర్మేరు ర్గురుమేరుః ప్లుతస్యచ॥
మేరు స్సంయోగమేరుశ్చ ఖండప్రస్తారకంస్మృతః
ఇతిప్రస్తారకస్యైవ లక్షణం కథితో బుధైః॥

తా॥ ప్రస్తారము, సంఖ్య, నష్టము, ఉద్దిష్టము, పాతాళము, ద్రుతమేరువు, లఘు మేరువు, గురుమేరువు, ప్లుతమేరువు, సంయోగమేరువు, ఖండప్రస్తారము, అని పది విధంబులనుండును. ఈతాళ ప్రస్తారమార్గంబులు అంగశ్రేణి, సంఖ్యా శ్రేణి, పాతాళము, మహాపాతాళము అను లెక్కలు చెప్పుట కుపయోగించు చున్నవి. మఱియు మేరువులు జాతిజాతి నిష్టములుగా వేరె వేరె ఏర్పడు చున్నవి. ఇందలి ప్రయోజనము నష్టోద్దిష్టము చెప్పుటకే తప్ప ఈ ప్రస్తార ప్రకార మేర్పడు తాళములు కొన్ని వాడుకలో లేనందున నీప్రస్తార ప్రాణము అతివిస్తరమగుటచే వాట్లనంతయు వివరించుటలో ప్రయోజనము లేదనే హేతువచే వదలిపెట్టడమైనది.

దశప్రాణములు సంపూర్ణము.



## సప్తస్వరముల యొక్క వివరములు

స. షడ్జమము అనగా:— ఋషభాది నిషాదాంత్యము గాఁ గల ఆరుస్వరములకు పుట్టిన స్థానము గాను, ఆరు స్వరములను బుట్టించునది గాను మానవ శరీరములో ముక్కు, కుత్తుక, ఉరస్సు, దవడ, నాలుక, దంతములు, నీ యారు స్థానముల ద్వారముగ బుట్టినదిగా నుండుటచేత షడ్జమమని చెప్పఁబడుచున్నది.

రి. ఋషభము అనగా:— హృదయమునందు ప్రవేశించునది గనుక ఋషభ మనంబడును. ఆవుల గుంపులో ఆంబోతు ఎద్దు బలవంతుడై యుండునో అట్లే యీ ఋషభము స్వరగుంపులో రెండవ స్థానమునందు గంభీరత్వము జెందినదై యున్నది.

గ. గాంధారమనగా:— గంధర్వ సుఖహేతుత్వమైనది. గనుక గాంధారమని చెప బడినదై యున్నది.

మ. మధ్యమమనగా:— సప్తస్వరములకు మధ్యస్థానమైన నాల్గవ స్థానమందుఁ బుట్టుటవలన మధ్యమమని చెప్పఁబడినదై యున్నది.

ప. పంచమ మనగా:— సప్తస్వరములలో నైదవస్థానమందు వచ్చునది గావున పంచమ మని చెప్పఁబడుచున్నది.

ధ. ధైవత మనగా:— ధీరత్వము జెందినదై ఆరవస్థానములో వచ్చుచున్నందున ధైవత మనంబడుచున్నది.

ని. నిషాద మనగా:— షడ్జాది ధైవతాంతమైన అన్ని స్వరములను ముగించు చోటులో నుండునది గనుక నిషాద మనంబడుచున్నది.

## పదునైదు గీతాధికములయొక్క వివరములు

1. ఘనరాగపంచక మనగా:— నాట, గౌళ, ఆరభి, వరాళి, శ్రీరాగము యీ అయిదు రాగములను ఘనరాగపంచక మనంబడునది.
2. సాధారణ లేక సంచారిగీతము:— క్రియకు అక్షరకాలముగ నడుచుచు ఇందు గల సాహిత్యము దైవస్తోత్రముగను అకార, ఇకార, ఉకారములతో గూడి యున్నదియును, గీతములయొక్క మాతువులు సంస్కృత భావమైన ప్రాకృత భాషాపదములను ఆభోగ ఖండ మాతువులలో అర్థములేని ఆఅ; ఇయ్యా, తియ్యా; అంవో; ఇయ్యా; అరే, యను శబ్దములును వుండవలెను. రచనకర్తలు పురందరదాసు, పైడాల గురుమూర్తి శాస్త్రులు మొదలగువారు.

3. లక్షణగీతము:—ఇందుగల సాహిత్యము ఆ లక్షణగీతము యొక్క రాగలక్షణమును అనగా ఆ రాగము యొక్క గ్రహ, వర్జ, వక్రన్యాస, అంశస్వరములను, ఔడవ, షాడవ, సంపూర్ణ, స్వభావమున్నూ; అది జన్యరాగ లక్షణగీతమయినచో, దాని జనకరాగమును; భాషాంగ రాగలక్షణ గీతమైనచో దాని అన్యస్వరము మొదలగు వివరములను కలిగియుండును. రచన కర్తలు గురుమూర్తి శాస్త్రి, వెంకటమఖి మొదలగువారు.

4. స్వరజతి:—మధ్యమ కాలముగా శృంగార రసమైన మాతువులను, పల్లవి, అను పల్లవి, చరణములను, అను పల్లవికి చివర ముక్తాయి స్వరరూపమైన ధాతువును, అందు పగము పాటయును పగము స్వరమును చివర, తధింగిణతోం అను పాతమును చేర్చి పల్లవిని యెత్తుకొనునట్లు యుండవలెను. దీనికి సాహిత్యము పోకడ కూడ యన్ని యక్షరములుగ యుండును, రచనకర్తలు శ్యామశాస్త్రి, ఆది అప్పయ్య మొదలగువారు.

5. పదవర్ణము:—పదవర్ణము చౌకవర్ణమని వాడుక. వీనిలో పల్లవి, అను పల్లవి, చరణము మెత్తుగడ స్వరములు తప్పక యుండును. దీనికి ప్రతి పాదమునకు సాహిత్యముండి మిక్కిలి శృంగార రస ప్రధానము. దీనిలో సంగీతము నర్తకులు నడక నెమ్మదితో భావములను తెలియుట తగినట్లుగా యుండును. ఇవి సాని మేళములందు ఉపయోగించెదరు. పదవర్ణముల రచనకర్తలు మైసూరు సదాశివ రావు మొదలగువారు.

6. తానవర్ణము:—తాన గతితో గూడుకొని పల్లవి, అనుపల్లవి, ఉపపల్లవి, ముక్తాయి సర్వము, చరణము, స్వరములుగల్గి ప్రారంభించిన స్వరములోనే వచ్చి నిల్చునట్టి క్రియాస్థాయి. ఇందు సాహిత్యములో గల అక్షరముల మధ్య, అకార ఇకారాదులు విశేషములుగా యిమిడియుండును. రచనకర్తలు వీణ కుప్పయ్య మొదలగువారు.

7. కృతి:—భగవత్ సంబంధమైనస్తుతి గల్గి పల్లవి, అనుపల్లవి, చరణములు గల్గి యుండును. కృతిలోని సంగీతము సంగతులతోను, గమకములతోను, నిండి యుండును. రచనకర్తలు త్యాగరాజయ్య మొదలగువారు.

8. కీర్తన:—పల్లవి, అనుపల్లవి, చరణములను, విభాగములుగ గలిగియుండు ప్రాధాన్యమయిన సంగీత రచనకు కీర్తనమని పేరు. ఇందు గల సాహిత్యము భక్తి ప్రధానమైయుండును. కృతివలె కీర్తనలోగూడ పైదెలిపిన మూడు భాగములుండియున్నను, కొన్ని కీర్తనములలో అను పల్లవి, లేకుండనుగూడ రచింపబడియుండును. అట్టి కీర్తనలలో ఒక పల్లవి, చాలా చరణములు గలిగియుండును. రచనకర్తలు పురంధర విఠలు, భద్రాచల రామదాసు మొదలగువారు,

9. రాగమాలిక:—శృంగార రసముతోనైనను లేక భక్తిరసముతోనైనను ఆయా రాగముల కొనలందు, తాళానుసారమైన ఆవృత్తములు గల ముక్తాయి స్వరములు గల్గి పల్లవి యొక్క మొదటి రాగమును ఎత్తుకొనునట్లుండును. రచనకర్తలు శ్రీ సీతారామారావు మొదలగువారు.

10. పదము:—దేవతా సంబంధమగను శృంగార రసమునుగల్గి నాయికా, నాయక లక్షణములకు సంబంధించియుండును. మఱియు పల్లవి, అనుపల్లవి, చరణములు గల్గియుండును. రచనకర్తలు క్షేత్రజ్ఞులు, ఘనం సీనయ్య మొదలగువారు.

11. జావళీ:—ఇది శృంగార రసముతో నాయకా, నాయకీ లక్షణములతో, గ్రామ్యభావతో యిమిడియుండును. ఇది సాధారణముగా మధ్యమ కాలముగా పాడదగినవై యుండును. జావళీలు రచనకర్తలు ధర్మపురి సుబ్బారావు మొదలగువారు.

12. తరంగము:—నిబిడయుక్త భక్తి శృంగార రసయుతమగు ఉజ్జ్వల రసప్రధానమైన రచన. పల్లవి, అనుపల్లవి చరణములను విభాగములు గల్గి 12 సర్గలలో వ్రాయబడియున్నది. దైవప్రేరితమున శ్రీకృష్ణుని లీలలను నాయికా, నాయక లక్షణముల ననుసరించి, కృష్ణలీలాతరంగిణి యను పేర నీ గ్రంథమును నారాయణ తీర్థ యతీంద్రులచే సంస్కృతమున రచింపబడినది. ఇందుగల అనుపల్లవి చరణములు, ఒకే ధాతు శైలిని గలవిగా నుండును. రచనకర్తలు శ్రీనారాయణతీర్థ యతీంద్రులు.

13. అష్టపది:—ఇది శృంగార రస ప్రధానమై యుండును. ఈ గ్రంథమునకు గీతగోవిందము యని పేరు. కీర్తనకు యెనిమిది పాదములుండును. పల్లవి, అను పల్లవి, చరణములుగా లేక అన్నియు ఒకేమాదిరిగల చరణములుగా నుండును. అష్టపదులు జయదేవ కవి రచించెను.

14. దరు:—పదమువలె శృంగార రస ప్రధానమైయుండు నొక విధమగు రచనకు దరు అని పేరు. దీని నడక మధ్యమ కాలముగానుండును. ఈ దరువులలో కొన్ని ఒక చరణములోను, కొన్ని రెండు మూడు చరణములతోను గూడి యుండును. రచనకర్తలు ముద్దుస్వామి దీక్షితులు మొదలగువారు.

15. తిల్లాన:—అన్యదేశీయమైన తిల్లాన నుండి తీయబడిన యొక విధమైన రచనకు తిల్లాన యని పేరు. ఇది సాధారణముగా మధ్యమ కాలముగానుండును. దీనిలోని సంగీతము మిక్కిలి సజీవముగాను, వేగముగాను ఉండును. దీనికి పల్లవి, అనుపల్లవి, అను విభాగములుగా నుండును. దీనియందు గల, మాతువు, స్వరసాహిత్య యుతమగు జతులు గలదిగా నుండును. రచనకర్తలు పల్లవి శేషయ్యర్ మొదలగువారు. కొన్ని తిల్లానలకు చరణము కూడ గలిగియుండును.

వెంకటమఖియొక్క మేళకర్తరాగపద్ధతి:—సప్తస్వరములు ప్రకృతి వికృతి భేదములచే యేర్పడు 16 స్వరములకు వరుసగా స ర-రి-గ-రు-గి-గు-మ-మి-ప ధ-ధి-న-ధు-ని-ను-యను సంకేతాక్షరములను కల్పించియున్నారు. అట్టి సంకేతాక్షరములైన ప్రకృతి వికృతి భేదముల మార్పుల వలననే మేళకర్తలు 72 గా యేర్పడుచున్న వివరములను యీక్రిందను తెలుపబడుచున్నది.

సప్తస్వర సంకేతములనబడు స-రి-గ-మ-ప-ధ-ని, యను యేడక్షరములను రెండు భాగములుగ భాగింపబడి అందు, స-రి గ-మ, యను మొదటిభాగమునకు పూర్వాంగమనియు, ప-ధ-ని- యను రెండవ భాగమునకు ఉత్తరాంగమనియు చెప్పబడును. పూర్వాంగమగు, స-రి-గ మ- లోని ప్రకృతి(శుద్ధ) వికృతి భేదములలో శుద్ధ స్వరములగు, షడ్జ, శుద్ధ ఋషభ, శుద్ధ గాంధార, శుద్ధ మధ్యమములును, ఉత్తరాంగమగు ప-ధ-ని- లోని ప్రకృతి (శుద్ధ) వికృతిభేదములలో శుద్ధస్వరములగు పంచమ, శుద్ధధైవత, శుద్ధనిషాదములును చేరి యేర్పడునట్టి శుద్ధస్వర సప్తకము కలస గలుగు వది యొక మేళమగును. ఇదే విధమున పూర్వాంగముయొక్క శుద్ధ స్వరములచే ఉత్తరాంగముయొక్క శుద్ధవికృతి స్వరములను ప్రస్తరించిన ఆరు మేళములగు విధమును వెంకటమఖి వారి సంకేతాక్షరములతో నీక్రింద తెలుపబడుచున్నది.

ఉత్తరాంగము - పూర్వాంగము

| | | | | |
|---|---|---|---|---|
| | ప ధ న | | 1 సరగమ ప ధ న | యీ ఆరుమేళములును, |
| | ప ధ ని | | 2 సరగమ ప ధ ని | సరగమ యనుపూర్వాం |
| 1 సరగమ | ప ధ ను | అనగా | 3 సరగమ ప ధ ను | గముచే ఉత్తరాంగమును |
| | ప ధి ని | | 4 సరగమ ప ధి ని | ప్రస్తరించగా ఏర్పడినవి |
| | ప ధి ను | | 5 సరగమ ప ధి ను | |
| | ప ధు ను | | 6 సరగమ ప ధు ను | |

పైని తెలుపబడిన విధము అనగా,

1 సరగమయను పూర్వాంగభేదముచే ఉత్తరాంగభేదముల ప్రస్తరించిన 6 మేళములును

| | | | | |
|---|---|---|---|---|
| 2 సరగిమ | — | — | 6 | ,, |
| 3 సరగుమ | — | — | 6 | ,, |
| 4 సరిగిమ | — | — | 6 | ,, |
| 5 సరిగుమ | — | — | 6 | ,, |
| 6 సరుగుమ | — | — | 6 | ,, |

యేర్పడుచున్నవి. అనగా ఒక్కొక్క పూర్వాంగ భేదమునకు 6 మేళకర్తల చొప్పున 6 పూర్వాంగ భేదములకు 6 × 6 = 36 మేళములు,

మ. అనుశుద్ధమధ్యమ ప్రస్తారముచే గలిగెను. వీనికే పూర్వ మేళము లబడును. ఇదేవిధముగనే 36 మేళములను, మి - అను ప్రతిమధ్యమ ప్రస్తారముచే మరియొక 36 మేళములు గలిగెను. వీనికే ఉత్తరమేళములందురు. గనుక, మ - మి యను శుద్ధమధ్యమ, ప్రతిమధ్యమ ప్రస్తారములచే 36 × 2 = 72 మేళములు యేర్పడుచున్నవనియు యింతకంటెను హెచ్చింపను తగ్గింపను కైలాసపతికైనను సాధ్యము కాదనియు వెంకటమఖి చెప్పియున్నాడు. ఇదే వారిమేళకర్తరాగములపద్ధతి మరియు వెంకటమఖి సంకేతాక్షరములలో సప = షడ్జపంచమము లనియు, ర - రి - రు = ఋషభములోని 1,2,3 భేదములనియు. గ-గి-గు = గాంధారములోని 1.2.3 భేదములనియు, మ మి = మధ్యమములోని, 1.2 భేదములనియు, ధ-ధి-ధు = ధైవతములోని 1,2,3 భేదములనియు, న-ని-ను = నిషాదములోని, 1.2.3 భేదములనియు గ్రహించేది.

## 72 మేళకర్త రాగములకు 12 చక్రములకున్ను శ్రీ వెంకటమఖి పెట్టిన నామములు

1 కనకాంబరి, 2 ఫేనద్యుతి, 3 గానసామవరాళి, 4 భానుమతి. 5 మనోరంజని, 6 తనుకీర్తి, 7 సేనాగ్రణీ, 8 జనతోడి, 9 ధునిభిన్నషడ్జము, 10 నటాభరణము, 11 కోకిలరవము, 12 రూపవతి, 13 గేయహెజ్జజ్జి, 14 వాటీవసంతభైరవి, 15 మాయామాళవగౌళ, 16 తోయవేగవాహిని, 17 ఛాయావతి, 18 జయశుద్ధమాళవి, 19 ఝంకారభ్రమరి. 20 నారీరీతిగౌళ, 21 కిరణావళి, 22 శ్రీరాగము. 23 గౌరీవేళావళి, 24 వీరవసంతము, 25 శరావతి, 26 తరంగిణి, 27 సౌరసేనా, 28 హరికేదారగౌళ, 29 ధీరశంకరాభరణము, 30 నాగాభరణము, 31 కలావతి, 32 రాగచూడామణి, 33 గంగాతరంగిణి, 34 భోగచ్ఛాయానాటా, 35 శైలదేశాక్షి, 36 చలనాటా, 38 సౌగంధినీ, 38 జగన్మోహనము, 39 ధాళివరాళి, 40 నభోమణి 41 కుంభిని, 42 రవిక్రియా, 43 గీర్వాణి, 44 భవాని. 45 శివపంతువరాళి, 46, స్తవరాజము, 47 సౌవీరము, 48 జీవంతినీ, 49 ధవళాంగము 50 నామదేశి, 51 కాశీరామక్రియా, 52 రమామనోహరి, 53 గమనక్రియా, 54 వంశవతి, 55 శ్యామళా, 56 చామరము, 57 సుమద్యుతి, 58 దేశిసింహారవము, 59 ధామవతి, 60 నిషదము, 61 కుంతళము, 62 రతిప్రియా, 63 గీతప్రియా, 64 భూషావతి, 65 శాంతకళ్యాణి, 66 చతురంగిణి, 67 సంతానమంజరి, 68 జ్యోతిరాగము, 69 ధౌతపంచము, 70 నాసామణి, 71 కుసుమాకరము, 72 రసమంజరి,—ఒక్కొక్క చక్రమునకు 6 రాగముల చొప్పున పన్రెండు చక్రముల పేర్లు యీక్రింద నిమిడియున్నవి. (1) ఇందు (2) నేత్ర (3) అగ్ని (4) వేద (5) బాణ, (6) ఋతు (7) ఋషి (8) వసు (9) బ్రహ్మ (10) దిశి (11) రుద్ర (12) ఆదిత్య—

# గ్రామఫోన్, రేడియో

గ్రామఫోను, రేడియోలు మానవలోకమునకు ఆధునికశాస్త్రజ్ఞుల రెండు కానుకలు.

గ్రామఫోనుద్వారా "రికార్డు" చేయబడిన సంగీతమును ఎన్నిసార్లైనను విన వచ్చును. రేడియో ద్వారా వేలకొలది మైళ్ళ దూరమున పాడు సంగీతమునుకూడ వినగలుగుచున్నాము.

1. గ్రామఫోను రికార్డుల శబ్దగ్రహణ పద్ధతి చాల చిక్కైనది. శబ్దగ్రహణ యంత్రమున కొక ప్రక్క "మైక్రోఫోను" ఉండును. అది అగదిలో పాడబడు చున్న సంగీతమును గ్రహించును. యంత్రమునకు రెండవ ప్రక్క ఒక సూది ఉండును. ఆ సూది మైనపు ప్లేటుమీద ఈ శబ్దతరంగములను (రికార్డు) ఎక్కించును.

ఈ మైనపు ప్లేటునుండి "నెగటివ్"లు తీసి వానినుండి గ్రామఫోను రికార్డులు తయారు చేసెదరు.

గ్రామఫోను రికార్డుల ద్వారా గొప్ప గొప్ప పాటకుల గానమును వారు మరణించిన తరువాతకూడ వినగలుగుచున్నాము. అమూల్యమైన సంగీతమును ఈవిధముగ మనము భద్రపరచుకొనగలము.

2. రేడియో "బ్రాడ్ కాస్టింగు స్టేషను"లలో శబ్దము బయటికిపోవవీలులేని గదులలో సంగీతము పాడబడును. మైక్రోఫోనుముందర పాడబడిన సంగీతము "ఈథరు" ద్వారా విద్యుత్తరంగముల రూపమున కొనిపోబడును. "రిసీవింగుసెట్లు" ఆ విద్యుత్తరంగముల నాకర్షించి మరల శబ్దతరంగములుగ మార్చును. ప్రతిరేడియో స్టేషనుకు "వేవ్ లెంగ్తు" అనునది ఉండును. ఈ రిసీవింగ్ సెట్టును మనము ఏస్టేషనులోని సంగీతము వినదలచిన ఆ స్టేషను వేవ్ లెంగ్తుకు సరిచేసుకొనిన యెడల ఆస్టేషన్లోని సంగీతము మనము వినవచ్చును.

# సంగీత ప్రశ్నోత్తరములు

1. సంగీత మనగ నేమి ?
సంగీత మనగా, గీతము, వాయిద్యము, నృత్తము. అను నీమూటి చేత సంగీత మనంబడును. మఱియు, స్వరరాగ, తాళముల చేతనయు, సంగీతమనంబడును.

2. సంగీతము ఎన్ని విధములు ? మార్గము, దేశి అని సంగీతము రెండు విధములు.

3. మార్గ దేశి సంగీతమునకు గల భేదమేమి ?
ఈశ్వర ప్రణీతమైన సంగీతము మార్గమనంబడును. ఆ యా దేశములయందు వాడుక గలిగి మనోహరముగా నుండు సంగీతము దేశి యనంబడును.

4. నాదము ఎట్లు గలిగెను ?
ఆత్మ, మనస్సు, అగ్ని, వాయువు అను నీ నాలుగింటివలన నాదము బుట్టెను.

5. ఆహత, అనాహత నాదమునకు గల భేదమేమి ?
ఆహతనాదమనగా శ్రుత్యాదిముఖముగా జనరంజకము జేయునది. అనాహత నాదమనగా తన చిత్తమున తొక్కనికే తెలియదగినది.

6. శ్రుతియనగా నేమి ?
స్వరారంభకావయవ ధ్వనివిశేషము శ్రుతి యనంబడును.

7. శ్రుతి ఎన్ని జాతులు గలది ? అది ఎన్ని భేదము లగును ?
దీప్త, ఆయత, కరుణ, మృదు, మధ్య అని శ్రుతి ఐదుజాతులు గలిగి. 22 భేదము లగుచున్నది.

8. షడ్జాది స్వరములకు నియత శ్రుతు లెవ్వి ?
చందోవతి, రతిక, క్రోధి, మార్జని, ఆలాపిని, రమ్యక్షోభిణి అనునవి నియత శ్రుతులు.

9. శుద్ధవికృత స్వరములకు గల భేదమేమి ?
నియతములైన శ్రుతులతో గూడుకొన్న స్వరములు శుద్ధము లనంబడును నియతములకు హెచ్చుగాని తక్కువగాని అయిన స్వరములు వికృతము లనంబడును

10. సప్తస్వరములలో వికృతిని పొందని స్వరము లెవ్వి ?
షడ్జమము, శుద్ధరిషభము, అంతరగాంధారము, శుద్ధమధ్యమము. పంచమము శుద్ధధైవతము, కాకలీ నిషాదము అనునవి వికృతిని పొందని స్వరములు,

11. స్వరశబ్దానకు అర్థమేమి?
(స్వ) స్వకీయముగా (ర) రంజించునది గాన స్వరమని చెప్పఁబడెను.

12. స్వరమనగా నేమి?
శృతులు విడివిడిగాను వ్యక్తముగాను పలుకవు. కనుక వ్యక్తముగ వినదగినదియును యింపుగలదియు నగునట్లు పూర్వులు శృతులను పంచి, రంజనము గల అక్షరములతో నీ శృతులను జేర్చి పలికింపబడి యుండుటయే స్వరమనబడును. ఇట్టివి సప్తస్వరములు.

13. స్వరములు ఎన్ని విధములు? శుద్ధ వికృతము అని రెండువిధములు.

14. ఆరోహణ అవరోహణములకు గల భేదమేమి?
స్వరములను క్రమముగా హెచ్చుచూ బోవునది ఆరోహణమనియు, అట్లే తగ్గుచూ వచ్చునది అవరోహణమనియు చెప్పఁబడును.

15. గ్రామభేదములనగా నేమి? గ్రామభేదములనగా పాడుటకు శ్రుతి గూర్చుకొనుట.

16. గ్రామము లెన్ని విధములు?
షడ్జగ్రామము, మధ్యమగ్రామము, గాన్ధారగ్రామము అని మూడువిధములు.

17. షడ్జగ్రామమనగా నేమి?
మంద్రముయొక్క షడ్జస్థానమును ఆధార శ్రుతిగా నేర్పరచుకొని శ్రుతి గూర్చుకొనుట.

18. మధ్యమగ్రామ మనగా నేమి?
మంద్రషడ్జముయొక్క మధ్యమ స్వరమువరకు బోయి, ఆ మధ్యమస్వరమును ఆధారషడ్జముగా నేర్పరచుకొని శ్రుతి గూర్చుకొనుట.

19. గాన్ధార గ్రామమనగా నెట్టిది?
మధ్యమగ్రామముయొక్క షడ్జస్థానము మొదలు ఒకస్థాయి ఆరోహణముగా పోయి, దానిపైనున్న గాన్ధారస్వరమును ఆధారషడ్జముగా శ్రుతి గూర్చుకొనుట.

20. రాగమనగా నేమి?
స్వరవర్ణములచే అలంకరింపబడినదై జనుల చిత్తమునకు రంజకమైన ధ్వని విశేషము రాగ మనఁబడును.

21. రాగము ఎన్నివిధములు గలది? అవి ఎన్ని భేదము లగుచున్నవి?
షాడవము, ఔడవము, సంపూర్ణము అని రాగములు మూడువిధములు. అవి ఒక్కొక్కటి శుద్ధము, ఛాయాలగము, మిశ్రము అని మూడుభేదము లగుచున్నవి.

22. షాడవ ఔడవ సంపూర్ణమునకు గల భేదమేమి?
షాడవము 6 స్వరములును, ఔడవము 5 స్వరములును, సంపూర్ణము 7 స్వరములను గలిగియుండును.

23. సంపూర్ణ స్వరమునందు గలిగిన ఔడవభేదము లెన్ని ?
సంపూర్ణ స్వరమునందు గలిగిన ఔడవభేదములు పదిహేను.

24. ఆరోహణమునందు ఆఱును అవరోహణములో సప్తస్వరములుండుదాని పేరేమి?
ఆరోహణమునందు ఆఱు స్వరములును, అవరోహణమునందు యేడుస్వరములుండిన వానిని షాడవ సంపూర్ణ రాగమని పేరు.

25. స్థాయి అనగా నేమి ?
షడ్జమము మొదలు పై షడ్జమమునందుట స్థాయి యనంబడును.

26. మేళకర్త అనగా నేమి ? అవి యెన్నిగలవు ?
సంపూర్ణస్వరములుగల జనక రాగములకు మేళకర్తలని పేరు. అవి 72 గలవు.

27. డెబ్బదిరెండు మేళకర్తలకు చక్రములెన్ని ? చక్రమొక్కంటికి రాగములెన్ని?
చక్రమొక్కంటికి ఆఱేసి రాగముల చొప్పున 72 మేళకర్తలకు 12 చక్రములు గలవు.

28. సంగతి యనగా నేమి ?
సంగీత రచనయొక్క భాగములందుగాని పదజాలమునందుగాని, రంజకము కొరకు రాగతాళము లనుసరించి భావసంపత్తితో పాడబడు హెచ్చుతగ్గుల మార్పుగలది.

29. జన్యరాగము అనగా నేమి ?
. మేళకర్తల వలన బుట్టిన ఔడవషాడవాది రాగములకు జన్యరాగములని పేరు

30. మధ్యమము ఎన్ని భేదములు గలది ?
శుద్ధమధ్యమము, ప్రతి మధ్యమము అని రెండు భేదములు గలది.

31. రాగాంగము లెన్ని భేదములు గలవు?
రాగాంగము, ఉపాంగము, క్రియాంగము, దేశాంగము అని నాలుగుభేదములు గలవు.

32. రాగాంగ మనగా నేమి ?
రాగాంగమనగా సంపూర్ణములైన మేళకర్త రాగములు. (దీనికే జనకరాగ మని పేరు.)

33. ఉపాంగ మనగా నేమి?

మేళకర్తలవలన ఔడవ షాడవాది వర్జములచే బుట్టిన రాగములు. (రాగాంగ రాగమునకు స్వంత పుత్రుని బోలినదై యున్నది.)

34. క్రియాంగ మనగా నేమి?

రాగస్వరములను వక్రముచేయగా బుట్టిన రాగములు.

35. దేశాంగమనగా నేమి?

రెండేసి రాగములను గలుపుటవలన బుట్టిన రాగములు.

36. రాగస్వరూపము దేనివలన నేర్పడుచున్నది?

న్యాసము, అంశము, గ్రహము అను నీ మూటివలన రాగస్వరూపము నేర్పడుచున్నది.

37. న్యాసము అనగా నేమి?

ఒక్కొక్క రాగమును ఆలాపించునపుడు సంగతి విన్యాసముయొక్క చివర స్వరము మీద నిలుపుచుండునది న్యాసస్వర మనబడును.

38. ప్రత్యాహత మనగా నేమి?

అవరోహణ జంటస్వరములలో రెండవ స్వరమును కొట్టి దాని మీదిస్వరము యొక్క ఛాయను రప్పించుట.

39. అంశస్వర మనగా నేమి?

ఆయా రాగములలో సంగతిచేసి పాడునపుడు విశేషముగ ఆ స్వరము మాటి మాటికి ప్రయోగించునది అంశస్వర మనంబడును,

40. గ్రహస్వర మనగా నేమి?

రాగము నారంభించు నప్పుడేమి మధ్య మధ్య సంగతి నారంభించునప్పుడేమి ఆ స్వరములోనే యారంభించునది గ్రహస్వర మనబడును.

41. సమఎడుప్పు అనగా నేమి?

ఒక పాటలోని పల్లవినిగాని యే యితర భాగమునుగాని తాళమునందు మొదటి దెబ్బ మీద ప్రారంభించునది.

42. వాదిస్వర మనగా నేమి?

ఒక రాగమునందు గల జీవస్వరమును బోలి మాటి మాటికి నుపయోగింపబడు స్వరము.

43. సంవాది స్వరమనగా నేమి?

రెండుస్వరముల మధ్య, ఎనిమిది లేక పండ్రెండు శ్రుతులుండిన అట్టి రెండు స్వరములు ఒకటి కొకటి సంవాదు లనబడును.

44. కంపితము అనగా నేమి?

ఒక స్వరమును ఒక అక్షర కాలము కదలించి దానికి సమీపమునందు గల మీది స్వరము యొక్క ఛాయను రానటుల చేయుట.

45. నాదము యనగా నేమి?

సంగీత ధ్వని నా, ద, మను రెండక్షరములలో, నకారము ప్రాణమనియు, దకారము అగ్నియనియు సంజ్ఞ గావున నట్టి ప్రాణాగ్నుల సంయోగమువలన యేర్పడు ధ్వని.

46. గమకము అనగా నేమి?

మనదేశ సంగీతములో నుపయోగింపబడు రకరకములగు అందములు, కదలికలు, అలంకారములు మొదలైనవి, వినువారి కింపుగలుగు, ఆకర్షణలకు అర్థమిచ్చు పదము.

47. తాళమనగా నేమి?

సంగీతకాలమును తెలిసికొనుటకు నుపయోగించు కొలత.

48. జతి యనగా నేమి?

తక.తరి.కిట.నక.తధిం.గిణ.తోం అను తాళ ప్రత్యయములు గల రచనకు నామము.

49. గతి యనగా నేమి?

తాళమునకు ఆధారముగనుండి లీనమై నిర్ణీత సమయములందు గల్గు ధ్వని.

50. ప్లుతము అనగా నేమి?

ఎడమచేతిమీద కుడిచేతితో కొట్టి, మూడక్షర కాలములు వ్రేళ్ళను ఎంచి నాల్గక్షరకాలములు ఎడమచేతి చుట్టూ కుడిచేతిని త్రిప్పి నాల్గక్షరకాలములు కుడిచేతిని కుడివైపు క్రిందికి విడుచుట.

51. శుద్ధమధ్యమ మేళకర్త లెన్ని? ప్రతి మధ్యమ మేళకర్త లెన్ని? స్వరములయందు భేదము గలదా?

శుద్ధ మధ్యమ మేళకర్తలు 36 న్నూ, ప్రతి మధ్యమ మేళకర్తలు 36 న్నూ గలవు. స్వరములకు భేదము గలదు.

52. వికృతిని పొందని శుద్ధ స్వరములు గల రాగ మేద్ది?
వికృతిభేదములేని శుద్ధస్వరరాగము మాయామాళవ గౌళ.

53. తాళశబ్దమునకు వ్యుత్పత్తి ఎట్లు? అవి ఎన్ని విధములు?
తల ప్రతిష్ఠాయాం - అను ధాతువువలనను, కరతల ద్వయ సంయోగమువలనను, కాలము, క్రియ, మానము అను నీ మూటి చేరికవలనను, ఇన్నివిధముల చేత తాళశబ్దమునకు వ్యుత్పత్తి గలుగుచున్నది.

54. తాళమునకు ప్రాణములెన్ని? అవి ఎవ్వి?
తాళమునకు ప్రాణములు పది. అవి కాలము, మార్గము, క్రియ, అంగము, గ్రహము, జాతి, కళ, లయ, యతి, ప్రస్తారము అనునవి.

55. ఘాత అనగా నేమి?
ఘాత అనగా చేతిలో కొట్టెడి దెబ్బకు పేరు.

56. సంయోగ వియోగమునకు గల భేదమేమి?
రెండు హస్తముల చేత ఘాత చేయుట సంయోగ మనఁబడును. ఆ రెండు హస్తములు విడదీయుట వియోగ మనఁబడును.

57. తాళము ఎన్ని విధములు?
మార్గము, దేశి, అని రెండువిధములు.

58. మార్గతాళములెవ్వి? దేశీయతాళము లెవ్వి?
ఈశ్వర ప్రణీతమైనటువంటి చంచత్పుట, చాచత్పుట, షట్పితాపుత్రిక, సంపద్వేష్టిక, ఉద్ఘట్టములను పంచతాళములు మార్గతాళములు, తదితరములు దేశీయతాళము లనఁబడును.

59. తాళమునకు గల జాతు లెవ్వి?
చతురశ్ర, తిశ్ర, మిశ్ర, ఖండ, సంకీర్ణములను నవి తాళజాతులు.

60. సంకీర్ణజాతి ఎన్ని అక్షరములు గలది?
9 అక్షరములు గలది సంకీర్ణ జాతి యనఁబడును.

61. మిశ్రజాతి ఎట్లేర్పడినది?
చతురశ్రము, కలసి మిశ్రజాతి అయినది.

62. తాళాంగము లెన్ని? అవి యెవ్వి?
తాళాంగము లారు. అవి అనుద్రుతము, ద్రుతము, లఘువు, గురువు, ప్లుతము, కాకపాదము అనునవి.

63. జాతిభేదమగునట్టి అంగ మెద్ది?
లఘువు మాత్రమే జాతిభేదమగునట్టి అంగము.

64. అంగమనగా నేమి?
అంగమనగా తాళసంఖ్యను గుర్తులుంగుటకు చిహ్నములయిన సంజ్ఞ అంగమన బడును.

65. ధ్రువతాళము ఎన్ని అంగములు గలది?
ధ్రువతాళము నాలుగు అంగములు గలది.

66. అనుద్రుతమునకు ఎన్ని పేళ్లు గలవు?
అర్ధచంద్రము, అవ్యక్తము, వ్యంజనము, విరామము అనునవి అను ద్రుతమునకు పేళ్ళు.

67. ఏ యే అంగములచేత జంపెతాళ మనఁబడును?
లఘువు, అనుద్రుతము, ద్రుతము అను నీ మూడు అంగములచేతజంపెతాళ మనఁబడును.

68. త్రిశ్రజాతి ధ్రువతాళము ఎన్ని అక్షరములుగలది?
త్రిశ్రజాతి ధ్రువతాళము 11 అక్షరములు గలది.

69. మాత్ర అనగా నేమి? లఘువుకే మాత్ర అని పేరు.

70. తాళమార్గము లెన్ని విధములు?
దక్షిణము, వార్త్తికము, చిత్రము, చిత్రతమము, చిత్రతరము, అతిచిత్రతరము అని తాళమార్గములు ఆఱు విధములు.

71. మార్గము లనగా నేమి?
తాళాక్షరముయొక్క అక్షరము కొందలు మతియొక అక్షరమువరకు నడిచెడి కాలదీర్ఘములకు మార్గము లనంబడును.

72. దక్షిణమార్గము ఎన్ని మాత్రలచే నడుచును.
తాళాక్షరముయొక్క ఒక్కొక్క యక్షరమునకు ఎనిమిదేసి మాత్రలు చొప్పున నడచునది దక్షిణమార్గ మనబడును.

73. తాళక్రియలు ఎన్నివిధములు? మార్గక్రియలని, దేశ్యక్రియలని రెండువిధములు

74. క్రియలనగా నేమి? చేతితో జేసెడి అంగసంజ్ఞలకు క్రియ లనఁబడును?

75. తాళపాదము ఏయే క్రియలచేత వాడవలెను?
సర్పిణి, క్రిష్య, పతాక, పతిత అను నీ నాలుగు నిశ్శబ్ద క్రియలచేత వాడవలయును.

76. అతీత అనాగత గ్రహములకు గల భేద మేమి?

గీతము నడచిన పిమ్మట తాళము నడచునది అతీత మనఁబడును. తాళము నడచిన పిమ్మట గీతము నడచునది అనాగత మనంబడును.

77. లయ అనగా నేమి? తాళము నడుమ నడచెడి కాలము లయ యనఁబడును.

78. లయ ఎన్ని విధములు? అందు ద్రుతలయ ఎట్లగుచున్నది?

ద్రుతలయ, మధ్యలయ, విళంబితలయ అని మూడు విధములు. ద్రుతలయ అనగా ఎంతత్వరగా పాడదగునో అట్లు తాళము వేసికొని పాడుట.

79. మధ్యలయ ఎట్లుండునది?

ద్రుతలయకు రెట్టింపు విళంబముగా తాళము వేసికొని పాడునది మధ్యలయ యనఁబడును.

80. విళంబితలయకు గల భేదమేమి?

మధ్యలయకంటె రెట్టింపు విళంబముగా తాళము వేసికొని పాడునది విళంబిత లయ యనఁబడును.

81. యతి యనగా నేమి?

తాళాంగములుండు రీతినిబట్టి ఏర్పడుదానికి యతి అనఁబడును.

82. సమయతి యెట్లుండునది?

అనుద్రుత, ద్రుత, గురుప్లుతములలో ఎవ్వియైననువరే; సమానజాతీయములగు అంగములు గలది సమయతి యనంబడును.

83. ప్రస్తారమనగా నేమి?

ఒక సంఖ్యగల స్వరములుగాని, తాళాంగములుగాని పైన వ్రాసి ఆసంఖ్యకు సమానమగు వితర స్వరములచే రూపభేదము చేయునది ప్రస్తార మనఁబడును.

84. కాలము లెన్ని? ఆఱవకాలము ఎన్ని అక్షరములతో నడచును?

కాలములు ఆఱు. ప్రథమ, ద్వితీయ, తృతీయ వగైరా. ఆఱవకాలమున 32 అక్షరములచే నడచును.

85. ఆవృత్తమనగా నేమి? తాళముయొక్క సంపూర్తికి ఆవృత్తమని పేరు.

86. తాళోదాత్త మనగా నేమి?

తాళఘాత యేస్వరముమీద బడుచున్నదో అట్టిస్వరమునకు తాళోదాత్తమని పేరు.

87. స్వరోదాత్త మనగా నేమి?

తాళఘాతబడిన స్వరములు తప్ప మరి యే స్వరమునైనను అదిమి యుచ్చరించుదానికి స్వరోదాత్త మని పేరు.

88. దేశాదితాళము అనగా నేమి?

ఇది ఒక విసర్జితము, మూడు దెబ్బలు గలది. ఈతాళము నడక నెమ్మదిగా నుండును. విసర్జితములో, ముప్పాతిక అక్షరకాలము విశ్రాంతి అయినపిమ్మట పాట ప్రారంభింపబడును.

89. మధ్యాది తాళము అనగా నేమి?

దేశాదితాళమువలె ఒక విసర్జితము, మూడు దెబ్బలుండునుగాని తాళము నడక అంత నెమ్మదిగా నుండదు. ఇందు విసర్జితములో, అర అక్షరకాలము విశ్రాంతియైన తరువాత పాట ప్రారంభింపబడును.

90. చాపుతాళ మనగా నేమి? అవి ఎన్నివిధములు, అవి ఏవి?

సంగీతముయొక్క కాలపరిమాణమును దెలియజేయు నొకవిధమగు కొలత. అవి మూడు విధములుగా నుండును. (1) మిశ్రచాపు (లేక చాపు) మొదటి దెబ్బకు మూడు అక్షరముల కాలమును, రెండవ దెబ్బకు నాల్గు అక్షరముల కాలమును గలిగినది. (2) ఖండచాపు మొదటి దెబ్బకు రెండక్షరముల కాలమును, రెండవదెబ్బకు మూడక్షరముల కాలమును గలిగినది. (3) త్రిశ్రచాపు మొదటిదెబ్బకు ఒక అక్షరకాలమును, రెండవ దెబ్బకు రెండు అక్షరముల కాలమును గలిగినది.

91. జారు అనగా నేమి?

జారు అనగా క్రిందినుండి పైకిగాని, పైనుండి క్రిందికిగాని, ఒక స్వరము నుండి మఱికొన్ని స్వరములవరకు ఈడ్చుట.

92. వలయిక అనగా, నేమి?

వలయిక అనగా, ఒక స్వరము మొదలు దానిపైస్వరమువఱకు ఊగించుట.

93. అన్యస్వరమనగా నేమి?

మేళకర్తరాగమునకు యేర్పడ్చిన స్వరమును విడిచి యితర రాగస్వరము ఆ రాగములో యుపయోగించుట. (ఉదాహరణము) కాంభోజిరాగము:— స ని ప ధ స అను ప్రయోగములో దానికిగల కైశికి నిషాదమును, కాకలీ నిషాదముగా పుపయోగించుట.

94. పూర్వాంగమనగా నేమి? స రి గ మ

95. ఉత్తరాంగ మనగా నేమి? ప ధ ని

96. పూర్వమేళము అనగా నేమి?

శుద్ధమధ్యమ ప్రస్తారముచే పూర్వమేళము అనబడును.

97. ఉత్తరమేళములనగా నేమి ?

ప్రతి మధ్యమ ప్రస్తారములచే ఉత్తరమేళము లనబడును.

98. ఘనరాగమనగా నేమి ?

ఇది ఘనమైన నాభిశానముగా గానక్రియలను చేయదగినది. శౌర్య వీరోత్సాహములు గల పురుషుని బోలినదై యున్నది.

99. రక్తిరాగమనగా నేమి ?

ఇది వినువారి చిత్తమును రంజింపజేయునది. దీనిని నయరాగము మార్గరాగము అని యందురు. ఇది సొంపు, ఇంపులుగల మాటలచే చిత్తమును రంజించి మోహింపజేయుస్త్రీలను బోలినదై యున్నది.

100. దేశీయరాగ మనగా నేమి ?

ఇది ఉత్తరదేశమునుండి వచ్చినదగుటచే ఔత్తరరాగమని చెప్పుదురు. మరియు రంజనము జేయు స్వభావము గలది. ఇంపుగల మాటలచే మనస్సును కరగించి మోహింపజేయగల భోగస్త్రీలను బోలినదై యున్నది.

101. భాషాంగరాగ మనగా నేమి ?

ఇది ఉపాంగరాగముగా నుండియు అన్యరాగాంగ రాగ శుద్ధవికృతి స్వరములలో నేదైన ఒకటి లేక రెండు స్వరములను గొనియుండును. ఈ రాగము రాగాంగరాగమునకు స్వీకరించిన యితర స్త్రీ పుత్రుని బోలినదై యున్నది.

సంగీత ప్రశ్నోత్తరములు సమాప్తము

